# అశ్వపరీక్ష



'అభినవసహదేవ'

డాక్టర్. యేజెళ్ల శ్రీరాములు

ఇండియా గవర్నమెంటు ఇంపీరియల్ ఎగ్రికల్చరల్
రీసర్చి లైవ్ స్టాక్ కమిటీ మెంబరు, ఢిల్లీ.



# అంకితము

భూస్వామి, వర్తకశిఖామణి, అశ్వవైద్యాభిమాని, త్యాగియు

నగు

శ్రీ వేజళ్ళ రాఘవయ్య చౌదరిగారికి

యీ గ్రంథము నా మనఃపూర్వకముగా

సమర్పితము



# అశ్వపరీక్ష

## శాలిహోత్రుడు

జంతువైద్య శాస్త్రమునకు శాలిహోత్రుడునిధి. ఆయన రచించినదానికి శాలిహోత్రయని నామంబిడెను. అశ్వ వైద్యమునకు శాలోత్తర్ అని పేరు గలదు. ప్రాచీన వైద్యులలో శాలిహోత్రుడు అగ్రస్థానము వహించెను.

పూర్వపు తక్షశిలానగరము సమీపమున "శాలతురము" అను గ్రామము గలదు. ఆగ్రామము శాలిహోత్రుని జన్మస్థానము. కొంతమంది "లాహోరు" ఆయన జన్మస్థానమందురు. పాణిని గ్రామముకూడ శాలతురమే, కొంతమంది శాలిహోత్రునే"ధన్వంతరి" యందురు. కాని యశ్వవైద్యమం దెక్కువ ప్రావీణ్యము సంపాదించిన వారిని శాలిహోత్రునిపేర పిలుచుట గలదు. గొప్ప వైద్యులను "ఆయన ధన్వంతరి అండి" అనుట యిప్పుడును కలదు. అదే విధముగా శాలిహోత్రుని ధన్వంతరీ అని యందురు. దురదృష్టవశమున శాలిహోత్రుని లిఖితగ్రంథములు మూలములు పోయినవి. అతడే దేశములమువాడో నిర్ణయించుట సులభముకాదు. హయఘోషియని కుమారుడు శాలిహోత్రుడని నకులుడనినుడివెను. ఈవిషయ మాధారము చేసికొని క్రీస్తుశకము ఒకటవ శతాబ్దములోశాలిహోత్రుడు నివసించి యుండుననని ముఖోపాధ్యాయులి వాదము.

ఆ శతాబ్దములో 'ఇండోసిథియన్' ఆస్థానమునందు పెషావరునందు బౌద్ధమతప్రచారకుండగు అశ్వఘోషుడుగలడు. సుశ్రుతునకు శాలిహోత్రుడు కొన్నివ్యాసములు బోధించిన ట్లూహింపబడెను. ఈ విషయములన్నియు హైందవ వైద్యమున స్వర్ణయుగమునాటివి. శాలిహోత్రుడు బౌద్ధుడుకాదు, బ్రాహ్మణుడు. క్రీస్తుశకము మొదటిశతాబ్దమునాటికి అర్చకులు పురోహితుల అధీనమందుగల వైద్యము క్రమక్రమముగా క్షీణించుట కారంభించెను.

హిమాలయ పర్వతప్రాంతమునందు మగధరాష్ట్రములోగల కంపారణ్యమున శాలిహోత్రుడు తన విద్యార్థులకు పాఠములుచెప్పినట్లు తెలియుచున్నది.

గ్రీకులు హిందూదేశములో తిరిగిన ప్రాంతములందుగాక ఆయుర్వేద వైద్యవిద్య వంగదేశమున ప్రప్రథమమున ప్రారంభింపబడినట్లు తెలియుచున్నది. అశ్వజాతి చరిత్రకు, వానిని తర్ఫీదుచేయు విధానము, పెంచువిధానము, వానినుంచుటకు శాలలు, వానిని మాలీషుచేయు విధానము, ఆరోగ్యముగా నున్నవానిని జబ్బుగానున్నవానిని నెట్లుచూడవలెనో, ఏసమయములో వానిని కొనవలెనో, ఎప్పుడమ్మవలెనో, మొదలగు విషయములగూర్చి శాలిహోత్రుడు విద్యార్థుల కుపన్యసించెడివాడు. శాలిహోత్రశాస్త్రము ఎనిమిదిభాగములుగ విభజింపబడెను. శల్య, శాలాక్య, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యము, విషతంత్రము, రసాయనము, వాజీకరణము. ఈ భాగములలోని పెక్కువిషయములు అగ్నిపురాణములోనున్నవి. మత్స్య, గరుడపురాణములలో ఆయుర్వేదము వర్ణింపబడెను. సంస్కృతభాషలోనుండి సంస్కృతగ్రంథమును "చేరన" అనువారు హిందీభాషలోనికి భాషాంతరీకరించినట్లు "మిత్ర" అనువారు చెప్పుచున్నారు.

మహమ్మద్ కుమారుడైన ఘియాజుద్దీన్ షరీయా పరిపాలనకాలములో అనగా 1381లో ఆ హిందీగ్రంథమును కురాట్ ఉల్ ముల్కు అను పేరుతో పార్శీభాషలోనికి తర్జుమాచేయబడెను. హిందీ శాలిహోత్రునిగ్రంథము లక్నోలో నున్న రాయల్ పుస్తకభాండాగారములో నున్నది. అది 30 భాగములు గల గ్రంథము. గుఱ్ఱములను గూర్చిన పూర్తివిషయములిందుగలవు. ఇవిగాక శాలోత్తరనామంబుతో ఇతరగ్రంథములు గలవు. బరోడారాష్ట్రమున శాలిహోత్రుని గ్రంథములు పూర్తిగాగలవు. ఈ పేరుతోనే శాలిహోత్ర అను బెర్లిన్ పుస్తకభాండాగారములోగలదు. పూనాలోగల ఓరియంటల్ రిసర్చి లైబ్రరీలో వ్రాతప్రతులున్నట్లు తెలియుచున్నది. లాహోరులో కీ॥ శే॥ పండిత రాధాకృష్ణగారి భాండాగారములో శాలి

హోత్ర సారమను గ్రంథముగలదు. బర్నెల్ గారు తెల్పిన శాలిహోత్రో న్నాయగ్రంథములో 8భాగములు లేక 8 స్థానములుగలవు. అవి 1 ఉన్నాయ, 2 ఉత్తర, 3 శారీరక, 4 చికిత్స, 5 కిశోరచికిత్స, 6 ఉత్తరోత్తర, 7 సిద్ధిస్థాన, 8 రహస్య అనునవి. ఇండియా ఆఫీసునందు శాలిహోత్ర వ్రాత ప్రతినందు 9 భాగములుగలవు.

## మరికొన్ని నిదర్శనములు

మొగల్ చక్రవర్తి షాజహాన్ ఆస్థానములో సయద్ అబ్దుల్లా ఖాన్ ఫెరోజ్ ఝంగ్ సంస్కృతమునుండి పైగ్రంథమును పార్శీభాషలోనికి తర్జుమా చేసెను. ఈ ఫెరోజ్ చిత్తూరు రాణాఉమాసింగుపైకి దాడివెడలుటకై షాజహాన్ చేత పంపబడెను. ఆసందర్భమున అచటి పుస్తక భాండాగారము లోని పుస్తకములు ఈయనకు లభించెను. ఆ గ్రంథములో సంస్కృత భాషలో లిఖింపబడిన శాలిహోత్ర గ్రంథముగలదు. దానిలో 19 వేల శ్లోకములు గలవు. ఈ గ్రంథము రెండుభాగములుగా గలదు. మొదటిభాగము గుఱ్ఱపు జాతులు, వన్నె, సుడులు, లక్షణములను తెల్పును. రెండవభాగము వానికి సోకు రోగములు, వాని చికిత్సా భాగము తెలుపబడెను.

సర్ హెన్రీ ఇల్లట్ గారు శాలూత్తరనామముగల పార్శీభాషలోనికి తర్జుమాచేయబడిన గ్రంథములున్నట్లున్ను, వంగభాషలోని ధారాంముఖర్జీ గారు శాలిహోత్ర అశ్వచికిత్సాసార సంగ్రహమను గ్రంథమును ప్రచురించి నట్లును తెలియుచున్నది. శాలిహోత్రుడేగాక నకుల, భోజరాజు, జయ దత్తుడుకూడా గ్రంథములు వ్రాసినటుల తెలియుచున్నది. ఇవిగాక అగ్నిపురా ణము, తత్త్వచంద్రిక, నకులరచితమైన అశ్వచికిత్స, గార్గునియొక్క అశ్వ ఆయుర్వేద గ్రంథములలో శాలిహోత్రుని గ్రంథమునుగూర్చి చెప్పబడెను. విజయదత్త కుమారుడైన జయదత్తసూరి "అశ్వవైద్యక" అను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. దీనిలో గుఱ్ఱములనుగూర్చిన లక్షణములు, వ్యాధులు, వాని నివారణ మొదలగు విషయములుగలవు. కొన్నిరోగములను

కుముద్భుటుకు నల్లమంచు వాడుకనుగూర్చికూడ తెలుపబడెను. నల్లమందు 1424 సం॥ పూర్వము తెలియదుగనుక ఈగ్రంథము 1424 తరువాతదై యుండవలెను. "వాజిచికిత్స" అను గ్రంథమును భోజరాజు రచించినట్లు తెలియుచున్నది. గాని వ్యాప్తిలోనున్నట్లు కన్పట్టదు. "ఘోరనిదన్" అను గ్రంథము అస్సాముదేశీయునిచే రచింపబడినట్లు తెలియుచున్నది. ఇది భూటాన్ నుండి తీసికొనిరాబడినట్లు తెలియుచున్నది. దీనిలో గుఱ్ఱములను పెంచువిధానము, వాని లక్షణములు, అనుభవములనుగూర్చి ఉద్యోగుల అవసరములకూర్చి వ్రాయబడిన గ్రంథము. ఇది 1714–44 సంవత్సరములలో అస్సాముపాలకులగు శివసింహారాజు ఎస్టేటుడిపార్టుమెంటు గుఱ్ఱముల ఉపయోగముకొరకు వ్రాయించబడినది.

## ముఖ్య విషయములు

ప్రతిగ్రంథము ఎట్టి గుఱ్ఱమును కొనవలెనో నిరూపించినది. గుఱ్ఱముల రంగు, సుళ్ళు, చుక్కలు, స్వరములు, వీనిని గూర్చియు, చర్మము దళసరిగ నుండు శరీరముమీద వెండ్రుకలు మృదువుగ పట్టువలె మెత్తగా నుండవలెనని చెప్పబడెను. మూడుపాదములు తెలుపును, తెల్లని ఫాలభాగము గల గుఱ్ఱము చెడ్డది. పెంకిది, ఒకచెవి కురచగా ఒకచెవు పొడవుగా నుండరాదు. వికారపు అవయవములుగలవి మంచివిగావు. మనుష్యులలో జాతులున్నట్లు అశ్వములలో బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులుగలవు. మొదటి జాతి అశ్వములు రాజులకు మంత్రులకు పనికివచ్చును. రెండవది యుద్ధమందు ప్రఖ్యాతి బడయును. మూడవది వర్తకుల కుపయోగముగా నుండును. నాల్గవది మంచిదికాదు. అవి నీరుత్రాగు విధానమునుబట్టి ఈజాతులను గమనింపవచ్చును.

ఇప్పుడు మన భారత దేశములోగల గుఱ్ఱములు అనేక జాతులకు చెందినవి. కాని యివన్నియు లైడెక్కర్ గారు సివాలిక జాతికి చెందినవని నిరూపించుచున్నారు. ద్రావిడుల కాలమందు గుఱ్ఱములను పెంచుట అరుదు.

ఆర్యుల కాలములనుంచి గుఱ్ఱములను పెంచుట వాడుకలో నున్నది. సింధు సరస్వతీనదీ ప్రాంతములందు మంచి అశ్వములుండెడివి. బాహ్లిక దేశపు గుఱ్ఱములుకూడ ప్రసిద్ధి జెందినవి. పురాణములందు పెక్కుదేశములనుంచితీసికొని రాబడిన గుఱ్ఱములు పేర్కొనబడినవి. తార్తార్, కొల్కొ, సింధు, కాంభోజ, తనాయు, గాంధార, పాంచాల దేశములలో మేలురకపు గుఱ్ఱములు దొరికెడివి.

అర్ధశాస్త్రమునందిట్లు చెప్పబడెను. శ్రేష్టమైన అశ్వరాజములు కాంభోజ రాష్ట్రమునందుగలవు. మంచిగుఱ్ఱము లిదిగువప్రదేశములలోకూడ గలవు. సింధు, పంజాబు, అరేబియా, దేశములు వీనికి తరువాత చెప్పబడిన అశ్వములు బాహ్లిక, సౌవీర, పాపెయి, తైతల, దేశములవి మంచివి. మిగిలిన జాతులు హిందూదేశములో పలుచోట్లగలవు. హయాన్‌త్సాంగు గుఱ్ఱములను గూర్చి వ్రాయుచు కాశ్మీరపు గుఱ్ఱములు చాలామంచివి. సాగసైనవి. చిత్రాలలోని గుఱ్ఱములు చాలాపొట్టివి అని వ్రాసెను. ఐనా అక్బరీయము ప్రకారము మంచి అశ్వములు సామ్రాజ్యమునందన్ని భాగములలోను నుండెడివి. అరబ్బీ గుఱ్ఱములను మించునవి కచ్చిలో దొరకెడివి. పంజాబుగుఱ్ఱములు ఇరాకు వానిని మరపించును.

కృషిసంగ్రహమను గ్రంథములో గుఱ్ఱపుశాల గుఱ్ఱమునకు రెండు రెట్లుండవలెను. నాలుగుద్వారముల మధ్య ఖాళీస్థలముండవలెను. గుఱ్ఱములు దొర్లుటకు తగిన ఖాళీయుంచవలెను.

అత్రిసంహితలో గుఱ్ఱములు ఆహారము, నీరు తీసికొనిన తరువాత వెంటనే పనిచేయించరాదు. పనిచేసిన తరువాత గుఱ్ఱమును అటునిటు త్రిప్ప వలెను. తరువాత బెల్లము ఉప్పు పెట్టవలెను. తరువాత జీను, కళ్ళెము రికాబు తీయవలెను. గుఱ్ఱము ముక్కుపైని నేతిని రాయవలెను. గుఱ్ఱములకు సంవత్సరములకు రెండు పర్యాయములు నాళములు వేయవలెను.

"ఆల్ ఇండియా వెటరినరీ జర్నల్"

# ప్రసవకాల పట్టిక-గుఱ్ఱము

| పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| జనవరి | డిసెంబరు | ఫిబ్రవరి | జనవరి | మార్చి | జనవరి |
| 1 | 2 | 1 | 2 | 1 | 30 |
| 2 | 3 | 2 | 3 | 2 | 31 |
| 3 | 4 | 3 | 4 | 3 | ఫిబ్రవరి 1 |
| 4 | 5 | 4 | 5 | 4 | 2 |
| 5 | 6 | 5 | 6 | 5 | 3 |
| 6 | 7 | 6 | 7 | 6 | 4 |
| 7 | 8 | 7 | 8 | 7 | 5 |
| 8 | 9 | 8 | 9 | 8 | 6 |
| 9 | 10 | 9 | 10 | 9 | 7 |
| 10 | 11 | 10 | 11 | 10 | 8 |
| 11 | 12 | 11 | 12 | 11 | 9 |
| 12 | 13 | 12 | 13 | 12 | 10 |
| 13 | 14 | 13 | 14 | 13 | 11 |
| 14 | 15 | 14 | 15 | 14 | 12 |
| 15 | 16 | 15 | 16 | 15 | 13 |
| 16 | 17 | 16 | 17 | 16 | 14 |
| 17 | 18 | 17 | 18 | 17 | 15 |
| 18 | 19 | 18 | 19 | 18 | 16 |
| 19 | 20 | 19 | 20 | 19 | 17 |
| 20 | 21 | 20 | 21 | 20 | 18 |
| 21 | 22 | 21 | 22 | 21 | 19 |
| 22 | 23 | 22 | 23 | 22 | 20 |
| 23 | 24 | 23 | 24 | 23 | 21 |
| 24 | 25 | 24 | 25 | 24 | 22 |
| 25 | 26 | 25 | 26 | 25 | 23 |
| 26 | 27 | 26 | 27 | 26 | 24 |
| 27 | 29 | 27 | 28 | 27 | 25 |
| 28 | 30 | 28 | 29 | 28 | 26 |
| 29 | 31 | | | 29 | 27 |
| 30 | జనవరి 1 | | | 30 | 28 |
| 31 | | | | 31 | మార్చి |

# ప్రసవకాల పట్టిక - గుఱ్ఱము

| పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| ఏప్రియల్ | మార్చి | మే | ఏప్రియల్ | జూన్ | మే |
| 1 | 2 | 1 | 1 | 1 | 2 |
| 2 | 3 | 2 | 2 | 2 | 3 |
| 3 | 4 | 3 | 3 | 3 | 4 |
| 4 | 5 | 4 | 4 | 4 | 5 |
| 5 | 6 | 5 | 5 | 5 | 6 |
| 6 | 7 | 6 | 6 | 6 | 7 |
| 7 | 8 | 7 | 7 | 7 | 8 |
| 8 | 9 | 8 | 8 | 8 | 9 |
| 9 | 10 | 9 | 9 | 9 | 10 |
| 10 | 11 | 10 | 10 | 10 | 11 |
| 11 | 12 | 11 | 11 | 11 | 12 |
| 12 | 13 | 12 | 12 | 12 | 13 |
| 13 | 14 | 13 | 13 | 13 | 14 |
| 14 | 15 | 14 | 14 | 14 | 15 |
| 15 | 16 | 15 | 15 | 15 | 16 |
| 16 | 17 | 16 | 16 | 16 | 17 |
| 17 | 18 | 17 | 17 | 17 | 18 |
| 18 | 19 | 18 | 18 | 18 | 19 |
| 19 | 20 | 19 | 19 | 19 | 20 |
| 20 | 21 | 20 | 20 | 20 | 21 |
| 21 | 22 | 21 | 21 | 21 | 22 |
| 22 | 23 | 22 | 22 | 22 | 23 |
| 23 | 24 | 23 | 23 | 23 | 24 |
| 24 | 25 | 24 | 24 | 24 | 25 |
| 25 | 26 | 25 | 25 | 25 | 26 |
| 26 | 27 | 26 | 26 | 26 | 27 |
| 27 | 28 | 27 | 27 | 27 | 28 |
| 28 | 29 | 28 | 28 | 28 | 29 |
| 29 | 30 | 29 | 29 | 29 | 30 |
| 30 | 31 | 30 | 30 | 30 | 31 |
| | | 31 | మే 1 | | |

# ప్రసవకాల పట్టిక - గుఱ్ఱము

| పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| జూలై | జూన్ | ఆగస్టు | జూలై | సెప్టెంబరు | ఆగస్టు |
| 1 | 1 | 1 | 2 | 1 | 2 |
| 2 | 2 | 2 | 3 | 2 | 3 |
| 3 | 3 | 3 | 4 | 3 | 4 |
| 4 | 4 | 4 | 5 | 4 | 5 |
| 5 | 5 | 5 | 6 | 5 | 6 |
| 6 | 6 | 6 | 7 | 6 | 7 |
| 7 | 7 | 7 | 8 | 7 | 8 |
| 8 | 8 | 8 | 9 | 8 | 9 |
| 9 | 9 | 9 | 10 | 9 | 10 |
| 10 | 10 | 10 | 11 | 10 | 11 |
| 11 | 11 | 11 | 12 | 11 | 12 |
| 12 | 12 | 12 | 13 | 12 | 13 |
| 13 | 13 | 13 | 14 | 13 | 14 |
| 14 | 14 | 14 | 15 | 14 | 15 |
| 15 | 15 | 15 | 16 | 15 | 16 |
| 16 | 16 | 16 | 17 | 16 | 17 |
| 17 | 17 | 17 | 18 | 17 | 18 |
| 18 | 18 | 18 | 19 | 18 | 19 |
| 19 | 19 | 19 | 20 | 19 | 20 |
| 20 | 20 | 20 | 21 | 20 | 21 |
| 21 | 21 | 21 | 22 | 21 | 22 |
| 22 | 22 | 22 | 23 | 22 | 23 |
| 23 | 23 | 23 | 24 | 23 | 24 |
| 24 | 24 | 24 | 25 | 24 | 25 |
| 25 | 25 | 25 | 26 | 25 | 26 |
| 26 | 26 | 26 | 27 | 26 | 27 |
| 27 | 27 | 27 | 28 | 27 | 28 |
| 28 | 28 | 28 | 29 | 28 | 29 |
| 29 | 29 | 29 | 30 | 29 | 30 |
| 30 | 30 | 30 | 31 | 30 | 31 |
| 31 | జూలై 1 | 31 | ఆగస్టు 1 | | |

# ప్రసవకాల పట్టిక - గుఱ్ఱము

| పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| అక్టోబరు | సెప్టెంబరు | నవంబరు | అక్టోబరు | డిశంబరు | నవంబరు |
| 1 | 1 | 1 | 2 | 1 | 1 |
| 2 | 2 | 2 | 3 | 2 | 2 |
| 3 | 3 | 3 | 4 | 3 | 3 |
| 4 | 4 | 4 | 5 | 4 | 4 |
| 5 | 5 | 5 | 6 | 5 | 5 |
| 6 | 6 | 6 | 7 | 6 | 6 |
| 7 | 7 | 7 | 8 | 7 | 7 |
| 8 | 8 | 8 | 9 | 8 | 8 |
| 9 | 9 | 9 | 10 | 9 | 9 |
| 10 | 10 | 10 | 11 | 10 | 10 |
| 11 | 11 | 11 | 12 | 11 | 11 |
| 12 | 12 | 12 | 13 | 12 | 12 |
| 13 | 13 | 13 | 14 | 13 | 13 |
| 14 | 14 | 14 | 15 | 14 | 14 |
| 15 | 15 | 15 | 16 | 15 | 15 |
| 16 | 16 | 16 | 17 | 16 | 16 |
| 17 | 17 | 17 | 18 | 17 | 17 |
| 18 | 18 | 18 | 19 | 18 | 18 |
| 19 | 19 | 19 | 20 | 19 | 19 |
| 20 | 20 | 20 | 21 | 20 | 20 |
| 21 | 21 | 21 | 22 | 21 | 21 |
| 22 | 22 | 22 | 23 | 22 | 22 |
| 23 | 23 | 23 | 24 | 23 | 23 |
| 24 | 24 | 24 | 25 | 24 | 24 |
| 25 | 25 | 25 | 26 | 25 | 25 |
| 26 | 26 | 26 | 27 | 26 | 26 |
| 27 | 27 | 27 | 28 | 27 | 27 |
| 28 | 28 | 28 | 29 | 28 | 28 |
| 29 | 29 | 29 | 30 | 29 | 29 |
| 30 | 30 | 30 | 31 | 30 | 30 |
| 31 | అక్టోబరు 1 | | | 31 | డిశంబరు |

# గుఱ్ఱముల ఆరోగ్యము

ఆరోగ్యమే గుఱ్ఱములకు మహాభాగ్యము. ఆరోగ్యము దైవమనికూడనుడువ తగును. గుఱ్ఱములారోగ్యముగానుండుటకు మంచిఆహారమును,త్రాగుటకుమంచి నీరును, పీల్చుటకు శుభ్రమైన గాలియును లభించునటుల జేయుట మనకర్తవ్యము. గుఱ్ఱములను ఎండలోనుంచక, వర్షమునకు తడియనీయక కాపాడుచుండవలెను. గుఱ్ఱమునకు దేహారోగ్యమునకంటె అధికమైన శ్రేయస్సులేదు. అట్టి ఆరోగ్యము లేకపోయినప్పుడు ఆగుఱ్ఱము యేమాత్రమును పనిచేయజాలదు. ఒకవేళ చేయగలిగినను ఆపని గుఱ్ఱమునకు మిక్కిలి శ్రమయనక తప్పదు. కాబట్టి యజమాని వానిని ఆరోగ్యస్థితిలోనుంచుట ముఖ్యధర్మమై యున్నది. గాలివలన దీపమునకు హానికలుగక మనప్రయత్నపూర్వకముగా నెటుల కాపాడుచున్నామో అటులనే యుక్తమైన ఔషధాది వస్తువుల నెరింగి రోగములనుమాన్పుటకు ప్రయత్నము చేయవలెను.

## ఆహారము

వివిధదేశములయందు గుఱ్ఱముల కాహారముగ నుపయోగించు పదార్థములు వివిధములుగనుండును. ఇట్టి పదార్థస్వభావము దేశముయొక్క శీతోష్ణస్థితినిబట్టియు, ఆయాగుఱ్ఱములు చేయుపనులను బట్టియు మారుచుండును. గుఱ్ఱములకు పెట్టు ఆహారపదార్థములలో జీర్ణముకాగల మాంసకరపదార్థములు, ఉష్ణకరపదార్థములు, క్రొవ్వుపదార్థములు ఎంతెంతయున్నవో విచారింపవలయును. గుఱ్ఱములకు ఆహారము విస్తారముగా దొరకుకాలమందును, వేసవికాలమందును హెచ్చుతగ్గులు లేక సమానముగా ఆహారము పెట్టవలెను.

## గాలి

పుట్టినది మొదలు చనిపోవువరకు మేలుకొన్నను, నిద్రపోవుచున్నను ఎడతెగక చేయుపని గాలిని పీల్చుటయే. కనుక గుఱ్ఱములు బ్రతుకుటకు వాయువే ప్రాణాధారము. గుఱ్ఱముయొక్క శరీరమందలి పోషణమును,

ఉష్ణతయు, అనుకూలమగు ప్రాణవాయువు పశువుయొక్క జీవితాధారమై యున్నది.

## జ ల ము

ప్రపంచమునకు జలమే ఆధారము. గుఱ్ఱములకు కల్మషోదకమును త్రాగించరాదు. గుఱ్ఱములకాహారము పెట్టక కొన్నిదినములుంచవచ్చునుగాని నీటిని త్రాగించనిచో ఒక్కదినమైననుంచలేము. గుఱ్ఱముత్రాగు జలముపరిశుభ్రముగానుండవలెను. నిర్మలముగా నుండనియెడల ఆరోగ్యము చెడుటయేగాక అనేకరోగములు పుట్టును. కాబట్టి యజమానులు నౌకరులుకూడ మురికి, వాసన, రంగులేనినీటిని త్రాగించి కాపాడుదురుగాక.

## వి శ్రాం తి

కష్టపడి పనిచేసిన గుఱ్ఱమునకు విశ్రాంతి అవసరము. విశ్రాంతివలన అలసటజెందిన అవయవములు తిరిగి బలముజెంది యథాప్రకారము పని చేయుటకు దార్ఢ్యముకలవగును. ఎల్లప్పుడు యింటిదగ్గర గారాబముగా మేపు గుఱ్ఱమునకుకూడ విశ్రాంతి అవసరము. శరీరమెట్లు విశ్రాంతి గోరునో పశువు జీర్ణకోశముగూడ అట్లె విశ్రాంతిగోరును. జట్కాబండివారలు చేయుపనులు చాలా ఘోరముగానుండును. మేతతక్కువపెట్టి కిరాయి ఊపిరాడకుండ గుఱ్ఱములను పనిచేయించుచుండుటవలన ఎక్కువకాలము జీవించక త్వర లోనే మరణించుచున్నవి గాన విశ్రాంతి, తగిన ఆహారముపెట్టుట అత్యంతవసరము.

## మాలీసు చేయుట

గుఱ్ఱములకు మాలీసుచేయుట ఒకవిధమగు చికిత్సాపద్ధతిగ చిరకాలము నుండి యెంచబడుచున్నది. గుఱ్ఱము శరీరముయొక్క యేప్రత్యేకభాగము యొక్కగాని, పోషణకు బలపరచుటయును, వ్యాధివలన శరీరముయొక్క యేప్రత్యేకస్థలమందైనను వాపులను, వాపుదల ఫలితములను తొలగించెడి

కార్యక్రమములం దధికోద్రేకతను గలిగించుటయునైయున్నది. ఇందుమూల మున స్నాయువులవలన ముడుచుకొనుశక్తి అదివరకు నశించినయెడల మరల స్వాధతపరచబడును.

## రక్తప్రసారమునందు మార్పు

శరీరముపైన చేతితో మెల్లగాదువ్వీన రక్తప్రసారమునందు వెంటనే మార్పు గనిపించుచున్నది. చేతివ్రేళ్లు చర్మముపైన కొంతబలముతో నొత్తి పట్టి మెల్లగానడపినచో రక్తనాళములయం దుండెడి రక్తము ముందుకుపోయి మరల నాయొత్తిడిని తీసివేయగనే రక్తము తొందరగ వెనుకకుతిరిగి ప్రవహించుచున్నది. ఈచుడుకుదనమే రక్తప్రసారమునకు సహాయమొనర్చుచున్నది. చర్మము బొటనవ్రేలు నకును, చూపుడువ్రేలునకును మధ్య గట్టిగాబట్టుకొని మెలిపేసినయెడల నీరక్తప్రసారమధికమగుచున్నది. చేతితోగాని, వ్రేళ్ళతో గాని చరచినయెడల రక్తప్రసారముయొక్క చురుకుదన మధికమై ఆ స్థానము ఎరుపురంగుగానుండును. తోముట, పిసుకుట, నొక్కుట, ఒత్తుట, పిండుట, చిందరవందరగా కొట్టుట మొదలగు పద్ధతులు చాలా యుపయోగకరములై యున్నవి.

## అశ్వజాతుల వివరణ

శ్లో॥ జలధి మథనయోగం జగ్మషః పద్మయోనే ర్శ్నేమజలకణసంఘాః
ప్రోద్యతామారుతేన । ప్రమలదనల మధ్యంప్రాప్తితాస్తే
బభూవుర్హాయ ఇహహితే వైసరిస్న్రతావహ్నిజాతాః॥

పూర్వము సముద్రమథనకాలమునందు అరవిందభవుని (బ్రహ్మ) స్వేద బిందు సందోహము వాయువుచే చలించుచున్నవహ్ని అగ్ని మధ్యమందు పొందించబడి అశ్వములైజన్మించెను. ఇందువలన అగ్నిసంభవములని చెప్పబడుచున్నవి.

## కురుదేశమునందు జన్మించినవి

శ్లో॥ కురుదేశ సముద్భవాహయా సమదక్రౌంచరవాస్యముచ్ఛ్రితాః।
అతిదూరగతిక్షమా కృశాస్యమదంతాః కమలాచ్ఛలోచనాః॥

కురుదేశమునందు పుట్టిన గుఱ్ఱములు మదించిన క్రౌంచముల పక్షివంటి ధ్వనిగలిగి అతిదూరగమనము నందును, సామర్థ్యమునందును, శరీరమందును, కార్శ్యము, సమదంతత్వమునందును, తాజేళ్ళవంటి కన్నులుగలవై విలసిల్లుచుండును.

## కాశ్మీరదేశమునందు జన్మించినవి

శ్లో॥ అతివేగయుతా సురూపవర్ణా బహుసాంద్రాయుతవాలకేసరాః।
అతిచంచల పాదపల్లవా అపి కాశ్మీర సముద్భవాహయః॥

కాశ్మీర దేశమునందు పుట్టిన గుఱ్ఱములు మిక్కిలి వేగముగను, మంచి రూపవర్ణములు గలిగి సాంద్రమగువాలము, వెంట్రుకలు, మిక్కిలిచంచలమగు పాదములు గలిగి విలసిల్లుచుండును.

## బాహ్లీకదేశము నందు జన్మించినవి

శ్లో॥ పృథుపృష్ఠ యుజామహాశనాః ఘనగంభీరరవానువాదినః।
మృగరాజగమాబహుక్షమాయిహ బాహ్లీకభవాస్తురంగమాః॥

బాహ్లీక దేశమునందు పుట్టిన గుఱ్ఱములు మిక్కిలి పృష్ఠభాగము కలిగియుండును. అధికమగు ఆహారము, గంభీరమగు హేషాధ్వనులు, సింహముతో సమానమగు నడక, ఎక్కువ సహనము కలిగియుండును.

## ఘూర్జరదేశమునందు జన్మించినవి

శ్లో॥ అతిదీర్ఘో మయూరకంధరాఘననాదాః కృశకుక్కుటాంఘ్రయః।
బహుభారసహాప్లుతిప్రియా జవనా ఘూర్జరదేశ జాహయః॥

ఘూర్జరదేశమునందు జన్మించిన గుఱ్ఱములు నెమలికంఠమువలె పొడవుగను, మేఘ గంభీరధ్వనులతోనుండు అరవులతోను, కృశించి కుక్కుట

సమానపాదములును, ఎక్కువభారము సహించునవియును, ప్లుగతియందు మక్కువగలిగి వేగవంతములై యుండును.

## కాంభోజదేశమునందు జన్మించినవి

శ్లో॥ ఘనశౌర్యయుజశ్చ చారువక్షః పరిణాహాః పృథుమస్తకాన్వితాః ।
చపలాశ్చ చతుష్కగామినోభువి కాంభోజ సముద్భవాహయః ॥

కాంభోజదేశమునందు పుట్టిన గుఱ్ఱములు ఎక్కువ శౌర్యము, ప్రతాపములు గలిగియుండును. అందమగు వక్షస్థలము, ఎక్కువపొడవు, పెద్దతల, చాంచల్యము, చతుర్విధగమనములు గలిగియుండును.

## పాంచాలదేశమునందు జన్మించినవి

శ్లో॥ వినయోపచితామహాబలాః పతిభావానుగతా జవాన్వితాః ।
సమరేష్వవికంపనా భువిపాంచాల సముద్భవాస్తురంగమాః ॥

పాంచాలదేశమునందు పుట్టిన గుఱ్ఱములు నయవంతములై బలవంతములగుచు, పతిభావానుగతములై, జవయుక్తములై, యుద్ధమందు కంపము లేక సొంపుమీరియుండును.

## అవనదేశమునందు జన్మించినవి

శ్లో॥ అసమానగతి ప్రవృత్తి శీలాస్వమగ్రాతాః పృథుచంచవేక్షు....
పతిరక్షణ తత్పరామ్పృథే తనువాలాయ వనోద్భవాహయాః ॥

అవనదేశమునందు పుట్టిన గుఱ్ఱములు తమంతటతాము సుశిక్షితములుగ నుండును. శరీరము పెద్దదిగా నుండును. సింహముచేయు ధ్వనివలె సకిలించును. పొడుగగు నేత్రములు, మరుచవెంట్రుకలు, సక్రమమగు ముక్కురంధ్రములు గలిగియుండును.

## హూణదేశమునందు జన్మించినవి

శ్లో॥ మపితాస్స్వత, ఏవతీవ్రధారాః కలిఘోషాః పటవస్య ముర్ఛితాః ।
ఉపకార విదశ్చరూపవంతో భువియే హూణసముద్భవాహయాః॥

హూణదేశమునందుపుట్టిన గుఱ్ఱములు కోపయుక్తములును, స్వభావము చేత శీఘ్రగమనము గలవియు, మనోహరములగు సకిలింపులును, దార్ఢ్యము, ఔన్నత్యము, ఉపకారము, జ్ఞానమును, మంచిరూపమును గలిగియుండును.

## సింధుదేశమునందు జన్మించినవి

శ్లో॥ సువిస్తృతశరీర సంభవోరమణీ యాశ్చసులజ్జితాననాః।
మృదునాదయజోతి వేగవంతో హరయస్సింధుమహాతలోద్భవాః॥

సింధుదేశమునందు పుట్టిన గుఱ్ఱములు అన్ని అవయవములు అందముగను, కొద్దిగా వంగినముఖములు కలిగియుండి, మృదునాదయుక్తమై, అతి వేగవంతములుగా నుండును.

## సౌవీరదేశమునందు జన్మించినవి

శ్లో॥ జవసత్త్వయుతామహోదరాః పృథువక్త్రాః కరిరాజగామినః
అసితాంబుజదృష్టయోపితే హరయోయేతు సువీరదేశజాః॥

సౌవీరదేశమునందు పుట్టినగుఱ్ఱములు జవము, సత్త్వము, గొప్పఉదరము, విశాలమగు ముఖము, గజరాజగమనము, నలుపురంగు, తిన్ననికన్నులు కలిగి యుండును.

## సౌరాష్ట్రదేశమునందు జన్మించినవి

శ్లో॥ మధురస్వరనాదినోమహా జవసత్త్వాబహుసూక్ష్మమస్తకాః-
తనుదీర్ఘప్రదాః ప్రశస్తరూపాభువి సౌరాష్ట్రహయస్సురోమజాః॥

సౌరాష్ట్రదేశమునందు పుట్టినగుఱ్ఱములు యజమానియందు ఎక్కువ భయముగలిగియు, పెద్ద శరీరముగలిగియు, ఎక్కువ కామోద్రేకము, ఎక్కువ బలము, ఎక్కువ నడకగలవిగా నుండును.

## కళింగరాష్ట్రమునందు జన్మించినవి

శ్లో॥ అతిభీతియుతాశ్చ మాంసలాస్సదృశః కామవశంతదాస్సదా
బహుభారభృతో మహాబలాభువి కాళింగహయమహోద్ధతః॥

కళింగ దేశమునందు పుట్టినగుఱ్ఱములు అతిభయంకరముగను, స్థూల శరీరమును, అతి కోపోద్రేకమును, బహుసంచార సహములును, మహాబల యుక్తములై విలసిల్లును.

## నేపాల దేశమునందు జన్మించినవి

శ్లో॥ కుటిలద్విజదృష్టిపృష్ఠవాలా వికటత్వాన్నతలధావనక్షమాః।
పతిసౌఖ్యకృతో ఘనారవా భువి నేపాలమహీ భవాహయః॥

నేపాల దేశమునందు పుట్టినగుఱ్ఱములు దంతములు, దృష్టి, వాలము, పృష్ఠము, వంకరగలిగి, నిమ్నోన్నత స్థలములందు పరుగిడుటకు సమర్థతగలవై తమప్రభువునకు సౌఖ్యముచేయుచు, మేఘము గాంభీరధ్వనులవలె ప్రకాశించును.

## మాళవ దేశమునందు జన్మించినవి

శ్లో॥ ఏటువేగయుతాస్సమున్నతాః పృథుకాయాస్సమరేష్వకంపనాః।
అతిదూరగతిక్షమాహయః ప్రథితామాళవదేశసంభవాః॥

మాళవ దేశమునందు పుట్టినగుఱ్ఱములు అతివేగవంతములుగను, అత్యున్నతములుగను, అతి దృఢ దేహముగలవై, అతి దూరగమనములై యుండును.

## అశ్వపు కొలతలు

శ్లో॥ అశ్వలక్షణాన్యా హ భార్గాముఖో వాజీయశ్చోత్తమోత్తమః।
షట్ త్రింశ దంగుళముఖోహ్యుత్తమః పరికీర్తితః॥

ఏబది అయిదు అంగుళములు మొదలు కొని గుఱ్ఱముల పరిమాణములు ప్రత్యేకించి వివరింపబడుచున్నవి.

శ్లో॥ ద్వాత్రింశదంగుళముఖో మధ్యమ స్వముదాహృతః।
అష్టావింశత్యంగుళో యోముఖో నీచః ప్రకీర్తితః॥

నలుబది అంగుళముల పొడవుముఖముగల గుఱ్ఱముమిగుల శ్రేష్ఠమైనది. ముప్పదిఆరుఅంగుళముల ముఖముగల గుఱ్ఱము ఉత్తమమైనది. ఇరువదిఎనిమిది అంగుళముల ముఖముగలది నీచమైనది.

శ్లో॥ వాజినాం ముఖమానేన సర్వావయవకల్పనా।
ఔచ్ఛ్యంతుముఖ మానేన త్రిగుణం పరికీర్తితం॥

గుఱ్ఱముల ముఖపరిమాణము చేతను, అన్ని అవయవముల యొక్క పరిమాణము చేతను, కన్పింపబడును. ముఖముకొలతను త్రిరావృత్త (శిరస్సు, దవుడల రెండుప్రక్కల) మొనర్చిన ఔన్నత్యముగనుండును.

శ్లో॥ శిరోమణిం సమారభ్య పుచ్ఛమూలాంతఏవహి।
తృతీయాం శాధికం దైర్ఘ్యం ముఖమానాచ్చతుర్గుణం॥

శిరస్సునుంచి తోకవరకు కొలిచినచో ముఖమానముకంటె నాలుగు రెట్లు హెచ్చుగ నుండవలెను. ఉదరముయొక్క చుట్టుకొలత ముఖమానము కంటె మూడురెట్లును, మూడుఅంగుళములు అధికముగా యుండవలెను.

వీపు—27 అంగుళములు
చెవులు— 6 అంగుళములు
తల, కాళ్లు—40 అంగుళములు
మెడ—40 అంగుళములు

నుండుటమంచిది. గుఱ్ఱము నిలుచుండిన యెడల 100 అంగుళములుండవలెను. తలనుంచి తోకవరకు 160 అంగుళము లుండవలెను. బొడ్డునుంచి వీపు మీదుగానుండు చుట్టుకొలత 100 అంగుళము లుండవలెను. తలనుంచి తోకమట్ట మొదలువరకు కొలువవలెను.

## వయస్సు కనుగొనుట

శ్లో॥ ద్వాంత్రింశదాయురశ్వానాం దశాశ్చకథితాదశ।
త్రీణివర్షాణిమాసాచ్వాదినాని ద్వాదశైవహి॥

గుఱ్ఱమునకు ముప్పదిరెండు సంవత్సరముల ఆయువును, పది అవస్థలును గలిగియుండును.

శ్లో॥ ఆయుషోదశమోభాగోదశాః ప్రోక్తాః క్రమాద్దశ।
మధ్యస్థా స్త్రత్రషడ్చైవ ప్రశస్తాస్సుర్దశాః క్రమాత్॥

ఒక్కొక్క అవస్థకు మూడుసంవత్సరముల రెండుమాసముల పంద్రెండు దినములు. వీటిలో పదునారు దశలు ప్రశస్తములైనవి.

ముందరిదంతములు బోడసూపిన గుఱ్ఱముయొక్క వయస్సు ఒకనెలయనియు, ఆముందరి రెండుదంతములును పెద్దవిగా పొడవుగానుండిన రెండు నెలలవయస్సుఅనియు, మధ్య దంతములు కనపడినయెడల మూడు మాసములనియు, అవి స్పష్టముగానున్న నాలుగుమాసములనియు, మిగిలిన దంతములు వచ్చిన గుఱ్ఱము వయస్సు ఎనిమిదిమాసములనియు, ఆరుదంతములు స్పష్టముగానున్న ఏడునెలలనియు, ఆ దంతములు ఎరుపురంగుగా నున్నయెడల రెండేండ్లనియు గ్రహించవలెను. అన్నిపండ్లు కలియుటకు అయిదుసంవత్సరములు పట్టును.

దంతములు తెలుపుగానుండుట, స్థిరచిత్తముగలుగుట, కన్నులలో కాంతికలుగుట, బలము, పనిసేత, శరీరకాంతిగల గుఱ్ఱమునకు అయిదు సంవత్సరముల వయస్సు అని గ్రహించవలెను.

## మరొక గ్రంథకర్త అభిప్రాయము

గుఱ్ఱము పుట్టినపుడు పండ్లుండవు. ఒకనెలరోజులు జరిగిన తరువాత పైభాగమునందు రెండుపండ్లువచ్చును. అయిదవనెలనుంచి ఎనిమిదవనెల వరకు ఆరుపండ్లువచ్చును. ఎనిమిదవనెలనుంచి పంద్రెండు పండ్లువచ్చును. ఒక సంవత్సరమునకు పండ్లన్నియు తెలుపురంగుగానుండును. నాలుగవ సంవత్సరములో పండ్లు అన్నియు రాలిపోవును. అయిదవసంవత్సరములో మరల ఇరువదినాలుగు పండ్లువచ్చును. తొమ్మిది సంవత్సరములవరకు పండ్లమీద నలుపురంగుగల చారలుండును. పదునేడవ సంవత్సరము జరిగినతరువాత పండ్లచివర పసుపురంగుగనుండును. తరువాత నలుపుచారలు గలుగును.

శ్లో॥ ఛిద్రం సచలంపాతో దంతానాం చిత్రికేత్రికే।
ప్రోదేసు వలయస్త్రీంస్రః పూర్ణాయుర్ససవాజినః॥

ఇరువదినాలుగు మొదలు ఇరువదియేడు సంవత్సరములవరకు దంత ములు ఛిద్రతనొందును. ముప్పదిమూడు సంవత్సరములకు కదలును. ముప్పది మూడు వరకు దంతపాతమగును.

అశ్వగుఱ్ఱమునకు ఎంతవయస్సు యుండునది గుర్తించవీలుండదు. గుఱ్ఱము పెద్దదైనకొలది కన్నులచుట్టు వెండ్రుకలు వృద్ధిపొందును. ముసలి తనమువచ్చినకొలది నొసటిమీద ఎముకలు కనపడును. వృద్ధాప్యము వచ్చిన కొలది చర్మపు వెండ్రుకలు రాలిపోయి దేహముమీద మచ్చలు కనపడును. వెండ్రుకలుకూడ తెల్లబడును.

కుక్క, పంది, పిల్లి మున్నగు జంతువుల పండ్లవలెనున్నను, లెక్క పెట్టునపుడు ఎక్కువ, తక్కువలున్నను, దంతము మొదళ్ళలో మరొకదంతము మొలచినను, అట్టి గుఱ్ఱమును నుంచరాదు.

పండ్లవరుస చక్కగానుండక పండ్లులోనికి పోయినట్లుగాని, వెలుపలికి వచ్చినట్లుగాని, ముందునకు, వెనుకకుపోయినట్లుగాని యున్న గుఱ్ఱమున్న యజమానికి పుత్రశోకము గలుగును.

తక్కువపండ్లు కలిగిన గుఱ్ఱము మిత్రులవలన భయము, శత్రువులవలన పీడకలుగును. ఎక్కువ పండ్లుకలిగిన గుఱ్ఱము ప్రభువును, తనప్రజలను యమ లోకమునకు పంపును.

## స్వారివలనకలుగు లాభనష్టములు

శ్లో॥ అశ్వారోహణ మగ్ని మాంద్యశమనం తేజోవయస్థాపనం।
మేదోఘ్నం కఫశోషణకరం స్వేదోద్గమం మోదనం॥

గుఱ్ఱము నెక్కుటవలన తేజస్సు, ఆయువు, దృఢముగానుండును. జఠరాగ్ని ప్రదీపించును. దుర్మాంసమును బుట్టనియ్యదు. కఫశోషరోగములను నశింపజేయును. చమటను బుట్టించును. సంతోషమును కలుగజేయును.

శ్లో॥ ఓజఃకాంతి వివర్ధనం తనుభృతాం కీర్తిప్రద శ్రీకరం।
నోశస్తంచ నృణాం భగంధరవతాం పైత్యాశ్మరరోగ్ణాజూషామితి

హృదయమునందుండు పైత్య యుక్తరక్తమును, ఓజస్సు అనే కాంతియు అధికమగును. మానవులకు యశస్సును, లక్ష్మియును పెంపొందును. భగంధరము, మూలశంక, మూత్రకృచ్ఛము గలవారు గుఱ్ఱమునెక్కుటకు అర్హులుగారని తెలిసికొనవలెను.

## స్వారిచేయుట కర్హులు

శ్లో॥ దృఢాసనోర తత్వజ్ఞో జితముష్టిర్నిరాలసః ।
అవిరాగీస్థిరశ్చాపి షడైతే రాజి వాహకాః ॥ శాలిహోత్ర ॥

దృఢముగ గూర్చుండువాడు, నడిపించుటలో నేర్పరితనముగలవాడు, కళ్లెపుత్రాడులు పట్టుకొను నేర్పుగలవాడు, అలసటలేనివాడు, పట్టుదలలేనివాడు, స్థిరత్వముగలవాడు గుఱ్ఱమును స్వారిచేయుటలో నర్హులగుదురు.

## రాజులచే పూజింపబడువారు

పాదాగ్రమును చలించువాడు, నడుమును కదలించువాడు, అశ్వహృదయమును తెలిసినవాడు, యుక్తమైన కాలములో యుక్తమైన అంగములయందు దండమును ప్రయోగించువాడు, మిగుల శ్రేష్టుడు. ఇట్టివారు రాజులచే పూజింపబడుచుందురు. దృఢమైన ముష్టిగలవాడు, అశ్వముకోపముతో గూడియుండునపుడు భయములేనివాడు, సత్వమునందు స్థిరత్వముగలవాడు, అశ్వశాస్త్రము తెలిసినవాడు, ధార్మికుడు, నడుమును కొంచెము వంచుకొనియుండువాడు, యుక్తకాలమునందు సరిగా దండమును ప్రయోగించువాడు. సులక్షణములతోగూడిన మనుజుడు రాజులచే పూజింపబడును.

## నడకలు - శిక్షలు

శ్లో॥ అపోషితో భవేత్క్షీణో రోగీ చాత్యంతపోషణాత్ ।
సుగతిర్దుర్గతిర్నిత్యం శిక్షకస్సగుణాగుణైః ॥

పోషణలో తక్కువైన గుఱ్ఱము చెడిపోవును. ఎక్కువగా మేపుటవలన

రోగగ్రస్థమగును. కాబట్టి పరిమితిగా పోషించవలెను. యజమానియొక్క నేర్పునుబట్టి మంచి, చెడు నడకలు అలవాటగును.

శ్లో॥ గతయష్షడ్విధాధారా స్కందితం రేచితం ప్లుతం।
ధారీతకంచవలితం తాసాం లక్ష్మ ప్రక్ష్యదక్॥

ధార, స్కందిత, రేచిత, ప్లుత, ధారీతక, వల్గిత మని గుఱ్ఱపునడకలు ఆరు విధములుగనుండును.

శ్లో॥ ధారాగతిస్సా విజ్ఞేయాయాతి వేగతరామతా।
పార్ష్ణి తాడాతినుదితో యస్యాం భ్రాంతో భవేద్ధయః॥

తెంపులేక తేజముతో నడచుటవలన ధారాగతియందురు. మడమలచే నిషారాచేయబడి వేగముగాపోవుటకు కోరికగలదై

శ్లో॥ ఆకుంచితాగ్ర పాదాభ్యా ముత్ప్లుత్య యాగతిః।
ఆస్కందితా చ సా జ్ఞేయా గతివిద్భిస్తువాజినాం॥

పాదములచివరలచేత తిన్నగా మాటిమాటికి ఎగిరిఎగిరి నడచు గమనమునకు స్కందిత మందురు.

శ్లో॥ ఈషదుద్ధతగమన మఖండం రేచితం హితత్।
పాదైశ్చ తుర్భిదుత్ప్లు త్యగమనం స్యాత్ప్లుతాగతిః॥

కొంచెము ఎగురుచు నడచునది రేచితయందురు. నాలుగుపాదముల చేత నెగురుచు నడచునది ప్లుతయందురు.

శ్లో॥ అసంవలిత పద్భ్యాంతు సువ్యక్త గమనంతురం।
ధారీతకం చతత్ జ్ఞేయం రథసంవాహనేవరం॥

కాళ్లను పైకి కదలించక నూటిగా శీఘ్రముగా నడచునది ధారీతయందురు. ఇట్టిది రథారోహణమునకు శ్రేష్టము.

శ్లో॥ ప్రసంవలితపద్భ్యాం యోమయూరోద్ధృత కంధరః।
డోలాయిత శరీరార్ధ కాయో కధ్యతవల్గితం॥

విశేషముగా కదలింపబడిన పాదములచేత, నెమలివలె నెత్తయిన కంఠము కలదియై, ఉయ్యాలవలె నూగుచుండు శరీరముగల గమనమునకు వల్గిత యందురు.

## తేజ, రజ, తమోగుణములు

శ్లో॥ తేజోని సర్గజం సత్వం వాజినాం స్ఫురణంరజః।
క్రోధ స్తమ ఇతిజ్ఞేయాస్త్రయోపి సహజగుణాఇతి ॥

గుఱ్ఱముయొక్క స్వభావమువలన కలుగు బలమునకు తేజస్సు యన బడును. అదిరిపడుచుండుట రజమనబడును. క్రోధమునకు తమస్సుఅనబడును. ఈ మూడు గుఱ్ఱముయొక్క సహజగుణములు.

## పండ్రెండు వేళలందే శిక్షించవలెను

శ్లో॥ దండః ప్రయోజ్యోవాహానం కాలేషు ద్వాదశస్వపి।
గ్రీవాయాం భీతమాహాన్యా త్ర్యస్తం చైవచ మేహానే ॥

గుఱ్ఱములను పండ్రెండు సమయములలోమాత్రమే శిక్షించవలెను. భ్రాంతిగానున్నపుడు మెడమీదను, ఎక్కువభయముగానున్నపుడు మేహనము మీదను

శ్లో॥ విభ్రాంతచిత్త మధశేత్యక్త చిత్తం చ తాడయేత్ ।
ప్రహేషితం స్కంధబాహోర్వ్రబడబాలోకి నంతథా ॥

చపలచిత్తముగా నున్నపుడు భుజముమీదను, పెదవులతో పైకెత్తి యరచునపుడు, ఆడగుఱ్ఱమునుజూచి వికృతిగా కనపడినపుడు భుజ శిరముల మీదను, భుజములమీదను

శ్లో॥ ఉపవేశేచ నిద్రాయాం కటిదేశేచ తాడయేత్ ।
దుశ్చేష్టితంముఖే హాన్యా దుర్మార్గ ప్రస్థితంతథా ॥

నిద్రలోను, కూర్చుండబోవునపుడును తొంటిభాగములందు కొట్ట వలెను. దుష్టత్వముగ లేచినపుడు నేత్రములకు దగ్గరగను కొట్టవలెను.

శ్లో॥ అధనా హేషి తేస్కంధే స్ఖలిత జఘునాంతరే ।
భీతే వక్షస్థలం హన్యాద్వ్యుత్క్రమార్గ భ్రమేపిచ ॥

అరచునపుడు భుజములమీదను, తత్తరపడుచున్నపుడు పిర్రలమీదను, భయపడినపుడు, మార్గము తప్పినపుడు వక్షస్థలము మీదను.

శ్లో॥ కుపితే పుచ్ఛసంఘాతే భ్రాంతే జానుద్వయంతథా ।
నాసకృత్ప్రహరే దశ్వము కాలేచ విదేశకే॥

కోపముగానున్నపుడు తోకదగ్గరగను, భ్రాంతిగానున్నపుడు పిక్కల మీదను కొట్టవలయును. గుఱ్ఱమును మాటిమాటికి కొట్టుట చేతను

శ్లో॥ అకాలస్థానఘాతేన వాజీదోషాన్వితన్వతే ।
తావద్భవతితే దోషాయావజ్జీవత్య సౌవాయః ॥

అకాలమున స్థలమును తప్పించికొట్టుటచేతను తరుచుగా దోషములు కలుగును. ఆ దోషములు గుఱ్ఱము జీవించి యుండువరకు విడువవు

శ్లో॥ దుష్టదండే నాభిభవేన్నారోహేద్దండ వర్జితః ।
అశ్వదండనే దేశకాలాని భోజభూభుజోప్యాహ॥

దుష్టదండనము వలన ఎదురుతిరుగును. దండించకుండ నుండిన చెప్పిన మాటసరిగావినదు. దండించు సమయమున

శ్లో॥ మృదునైకేన ఘాతేన దండకాలేషు తాడయేత్ ।
తీక్ష్ణం మధ్యం పునర్ద్వాభ్యాం జఘన్యం నిష్ఠురైస్త్రిభిః ॥

నున్నితమగునొకదెబ్బ కొట్టవలెను. మధ్యమముగా నుండు గుఱ్ఱమునకు రెండు దెబ్బలు కొట్టవలెను. అధమముగానుండు గుఱ్ఱమును మూడు దెబ్బలు కొట్టవలెను.

శ్లో॥ జాన్వ ధశ్చల పాదస్స్యాదృజు కాయస్స్థిరాసనః ।
తులా ధృతఖనీనస్స్యాత్కాలే దేశేనుశిక్షకః ॥

మోకాళ్ళ క్రిందనుండు పాదముచివరను కదలించుచు, తదితర అవయవములను కదల్చకుండ స్థిరముగనుండి, తిన్నని శరీరముగలవాడై కూర్చుండి

యుండి, త్రాసుమాదిరిగా సమానముగా మంచిచెడ్డలను గ్రహించి గుఱ్ఱము యొక్క అవయవస్థానములందు అంతతీక్షణముగాకుండ కొరడాతో శిక్షించ వలెను.

## కాలమునుబట్టి స్వారిచేయించుట

శ్లో॥ సాయంప్రాయతశ్చ హేమంతే శిశిరేను సమాగమే ।
సాయం గ్రీష్మేతు శరధిప్రాత రశ్వం వహేత్సదా ॥

హేమంతఋతువులో ఉదయసాయంకాలములందును, వసంతఋతువులో సాయంకాలములందును, గ్రీష్మఋతువులో ఉదయమునను, గుఱ్ఱము ను స్వారిచేయవలయును

శ్లో॥ వర్షా సునవహేదీషత్త విషమ భూమిషు ।
సుగత్వాగ్నిర్బలం దార్ఢ్య మారోగ్యం వర్ధతే హయోః ॥

వర్షాకాలములో ఎత్తైన ప్రదేశములలో నెంతమాత్రము స్వారిచేయరాదు. గుఱ్ఱము యోగ్యమైనదిగా నున్నయెడల జఠరాగ్నియు, బలము, దార్ఢ్యము, ఆరోగ్యము వృద్ధియగును.

శ్లో॥ గతస్వేదస్యశాంత స్య సుమారముపతిష్ఠతః ।
దత్వాగురాం సలవణం బవతారయేత్
మర్దయిత్వాతుగాత్రాణి పాంసుమధ్యేవివాసయేత్ ॥

మార్గాయాసమునొంది వచ్చిన గుఱ్ఱముయొక్క సామానులను విప్పి, కళ్ళెమునుదీసి, మాలీషును బాగుగాచేసి, ఆదరించి మెత్తని ప్రదేశమందు కట్టవలెను.

## ఆహారపానీయము లిచ్చుట

శ్లో॥ స్నానపానావగాహైశ్చ తతస్యమ్యక్ప్రపోషయేత్ ।
సర్వదోషహరోశ్వానాం మద్యజాంగల గోరసం ।
అన్నంభుక్త్వా జలపీత్వా తత్క్షణాద్వాహితో హయః ॥

తదుపరి ఆహారపానీయములిచ్చి చక్కగ పోషించవలెను. కల్లు, గోవు పాలను త్రాగించిన సర్వదోషములు హరించును. ఇంకను శొక్తికాలది పాలను గాని, నీటితో కడిగిన నేతినిగాని త్రాగించవలెను.

శ్లో॥ ఉత్పద్యంతే తదాశ్వానాం కౌసశ్వాసాదికాగదాః ।
యవాశ్చ చణకాశ్శ్రేష్ఠాః మసుద్గా మధ్యమాస్మృతాః ॥

నీరుత్రాగించి దాణాపెట్టినవెంటనే స్వారీచేసినచో గుఱ్ఱమునకు శ్వాస కౌసాది రోగములుపుట్టును. గుఱ్ఱమునకు యవలు, శనగలు దాణా శ్రేష్ఠము. ఉలవలు మధ్యమము. చిరుశెనగలు, పెసలు నీచము.

శ్లో॥ హరిముద్గాంశ్చ మాషాన్వా భక్షణార్ధ మసట్టకాన్ ।
శుష్కా నార్ద్రాంశ్చమాషాని సూఖితాని ప్రదాపయేత్ ॥

పచ్చపెసలు, మినుములు దంచిగాని, నానబెట్టిగాని, ఎండించిగాని తినిపించవలయును.

శ్లో॥ భారమార్గ పరిశ్రాంతశ్చనైశ్చ క్రామయేద్దయం ।
స్నేహం సపాయయేత్పశ్చా చ్చర్క రాసక్తు మిశ్రం ॥

భారమువహించినట్టియు, మార్గపరిశ్రమనందినట్టియు, గుఱ్ఱమును నడిపించి, అలసటతీర్చి సత్తుపిండి పంచదార నేతితో కలిపి పెట్టవలెను.

## సకిలింపుల శుభాశుభములు

శ్లో॥ క్రౌంచవద్రిపువధాయపేతం గ్రీవయాత్వచలయాచసామ్ముఖం ।
స్నిగ్ధముచ్చమనుదాది హృష్టవద్గ్రాసరుద్ధవదనైశ్చవాజిభిః ॥

కొంగవలె సకిలించిన గుఱ్ఱముశత్రువునలె బాధించును. యజమాని కభిముఖముగ మెడ కదల్చక, సాంద్రముగ, సంతోషయుక్తమగునటుల మేసి, నోటితో గడ్డియుంచుకొని అరచినచో జయము శీఘ్రముగా కలుగును.

ఎడమపాదముచే భూమినిగోకుచు అరచిన గుఱ్ఱము తన యజమానుని మట్టిలో కలుపును. సంధ్యానురాగములను జూపుచు అరచుచున్న గుఱ్ఱము వలన బంధనము, పరాజయము, తన యజమానునికి కలుగును.

విశేషముగ అరచుచుండినను, తోకను తరచుగా కదలించుచుండినను, నిద్రయందత్యంత ఆసక్తియుండినను, బ్రతికి ప్రవాసమును ప్రకటించును.

రోమముల నూడ్చుచుండినను, దీనస్వరమైనను, తీక్ష్ణస్వరమైనను, ధూళినిగ్రహించినను తన యజమానికి భయముగలిగించును.

శ్లో॥ ముహుర్ముహుశ్శకృత్కరోతి నతాడ్యమానోప్యనులోమయాయి।
అకార్య భీతోశ్రువిలోచనశ్చశివంన భర్తుస్తురగోవిధత్తె॥

మాటిమాటికి మూత్రము, లద్దెవేయుచున్నను, కొట్టినవెనుక నడచినను, కారణములేకుండగనే భయపడినను, యశ్రుపాతముగలిగిన గుఱ్ఱము తన యజమానికమంగళము చేయును.

శ్లో॥ సముద్గవదక్షిణపార్శ్వశాయినః పాదం సముద్ధృత్య చ దక్షిణంసితాః।
జయాయశేషేష్వపి వాహనేష్విదం ఫలం యథాసంభవమాదిశేద్బుధః॥

కుడిప్రక్కను పరుండి, ఎడమకాళ్ళు ముడిచి, దక్షిణపాదము నెత్తినచో యజమానికి జయముకలుగును.

అవిచ్ఛిన్నముగ, దీనతలేనిదిగ, గంభీరముగ, ప్రతిధ్వనితో గూడినదిగ, మధురముగ, నుండు గుఱ్ఱపుసకిలింపు ప్రశస్తము.

అగ్నిచే పూరింపబడినపాత్రము, బ్రాహ్మణుడు, పుష్పములు, పెరుగు, వీటినిజూచి గుఱ్ఱము సకిలించిన శుభకరము.

వాయిద్యములయొక్క ధ్వనివిని నోటియందు గడ్డితో పూరింపబడినదగు గుఱ్ఱము సకిలించిన యజమానికి శుభము.

ధ్వజాగ్రము, సూర్యుడు, వీనినిజూచి అశ్వములన్నియు, నొకటిగ సకిలించిన మిగుల శుభము.

శ్లో॥ ఆరోహతిక్షితిపతౌవినయోపపన్నే యాత్రానుగోన్యతురగంప్రతిహేషదేచ।
వక్త్రేణతుస్పృశతి దక్షిణమాత్మపార్శ్వం యోశ్వశ్యపత్యురచిరా
త్ప్రతనోతిలక్ష్మీం॥

యజమాని స్వారిచేయుటకు వచ్చినప్పుడు వినయముతో నడుచ కోరిక గలదై మరియొక గుఱ్ఱమునుజూచి అరచినను, ముఖము చేత తన కుడిపార్శ్వమును స్పృశించినను అట్టిగుఱ్ఱము తన యజమానునికి త్వరలో సంపదను గలిగించును.

శ్లో॥ ప్రద్వేషోయవసాంభ సాంప్ర పతనం స్వేదోనిమిత్తాదినా।
కంపోవా వదనాచ్చరక్తపతనం ధూమాస్య వాసంభవః॥

గడ్డిమేయక, నీరుత్రాగక ద్వేషించిన పడుచుండిన, కారణములేకయే చెమటగలిగి, వణకిన, ముఖమునుండి రక్తము స్రవించిన, ధూమముపుట్టిన.

శ్లో॥ స్వప్నశ్చ నిశిధిరాత్రి షుదివానిద్రాల సధ్యానితాసాదో।
దుర్మనసాం విచేష్టితమిదం నేష్టం స్మృతం వాజీనాం॥

నిశిధమందుగూడ నిద్రలేకుండిన పగటివేళ పడుండిన, యలసట గలిగి ధ్యానించుచుండినటుల నటించినను,

శ్లో॥ అవఘోషణ మన్యవాజినాం పల్యాణాదాయుతస్య వాజినః।
ఉపవాహ్యాతురంగ మన్యవాకల్య ప్యేవవిపన్న శోభవా॥

అట్టి గుఱ్ఱము యజమానికి కష్టములు గలుగును. ఒక గుఱ్ఱము సరంజామొకదానికిని, కళ్ళెమునటుల దగిలించిన యాదను గలిగించును.

శ్లో॥ యద్దేహాం గణభాగే హేషంతి హయాస్తు నిత్యశో మధురం।
తద్దేహేనివసంతిశ్రీః కీర్తిః పుష్టిరాయుశ్చ॥

ఎవనిగృహాంగణమున నిత్యము మధురముగ గుఱ్ఱము సకిలించిన ఆయజమానికి సంపదయు, కీర్తియు, సంతుష్టియు, నష్టములేక యుండును.

## గ్రంథకర్తల అభిప్రాయములు

శ్లో॥ భ్రమరస్తు ద్విరావృత్తో వామ దక్షిణ భేదతః।
పూర్ణోపూర్ణః పునర్ద్వేధా దీర్ఘ హ్రస్వ స్తథైవజ॥

గుఱ్ఱముయొక్క ఎడమవైపున కుడివైపున సుడులుండును. వీటిలో

పూర్తిగా మెలితిరిగియు, తిరుగకుండనుండునవి యని రెండువిధములుగా నుండును. ఇంతియేగాక వీటిలో పొట్టివిగను పొడవుగను కూడయుండును.

శ్లో॥ స్త్రీవుంసే హేవామదక్షోయథోక్త పలదాక్రమాత్ ।
సతథా విపరీతౌతు శుభాశుభ ఫలప్రదే.

ఆడ, మగ గుఱ్ఱములయొక్క దేహమునందు ఎడమ, కుడిభాగవుసుడుల భేదముల వలన లాభనష్టములు క్రమముగా తెలిసికొనవచ్చును. ఆడగుఱ్ఱములకు కుడిభాగపు సుడులును, మగగుఱ్ఱములకు ఎడమభాగపుసుడులును యుండినచో శుభాశుభముల నీయజాలవు.

సుడులయొక్క ముఖములు క్రిందుగా, పైగా, అడ్డముగా నుండిన యెడల ఫలితములలో వ్యత్యాసములుండును. శంఖము, చక్రము, గద, పద్మము, వేదిక, స్వస్తిక, ప్రసాదతోరణ, ధనస్సు, పుష్పమాల, మత్స్యము, ఖడ్గము వలె సుడులుండిన హాయిగ, సుఖముగ ఫలములనిచ్చును.

## దశధృవులు

శ్లో॥ ద్వావురస్యౌ ద్వౌరంధ్రౌ పరంధ్రయోః ।
ఏకఃఫాల అపానే చదశావర్తా ధృవాస్మృతాః ॥

వక్షస్సలమున రెండును, శిరస్సున రెండును, ముఖమున రెండును, ముక్కురంధ్రములమీద రెండును, నొసటిభాగమున ఒకటియు, గుదభాగమున ఒకటియు కలిపి దశధృవులుండునని శాలిహోత్ర సంహితలో హాలాస్య ఖండమునందు తెలుపబడెను.

శ్లో॥ ఉరసిద్వౌశిరద్వావాస్యేద్వౌ నాసికేద్వయః ।
లలాట మధ్యేత్వే కశ్చపాయావేకః ప్రకీర్తితః ॥

ఈ పది సుడులున్న గుఱ్ఱములు ప్రశస్తములు. ఇవిలేకున్న దుర్లక్షణములు గలవని చెప్పబడెను.

శ్లో॥ అల్పాయుషోధ్రువమ్యానాధ్రువ పూర్ణాచిరాయుషః ।
కంఠదేశేతురంగాణాం జాజీ కోరకసన్నిభాః ॥

గుఱ్ఱమునకు పదునల్గున తప్పవయుండినచో అల్పాయువున్ను, పూర్తిగానుండిన పూర్ణాయువుకలుగునని హైకీలావతియను గ్రంథము తెలుపు చున్నది.

శ్లో॥ ఆవర్తోనిగళేయేషాం సదేవమణి కీర్తితః ।
స్వామినస్తే ప్రయచ్ఛంతి హయస్యార్వాశ్చ సంపదః ॥

ఏగుఱ్ఱముయొక్క కంఠమునందు సుడియుండునో దానిని దేవమణి యందురు. యజమానికి సర్వసంపదలగూర్చును.

## "శాలిహోత్ర సంహిత"

శ్లో॥ శ్రీవత్సో వక్షసి ప్రోక్తో స్వావర్తైః పంచనిర్భవేత్ ।
మధ్యమే చతుర్దిక్షు సంభూతైస్య ప్రదక్షిణైః ।

గుఱ్ఱము వక్షస్థలమునందు నాలుగువైపుల నాలుగు సుడులును, మధ్యగా నొకటియు, దక్షిణవైపుగా సుడులున్న

శ్లో॥ శ్రీవృక్షకీతురంగస్తు భర్తుస్సర్వార్థసాధకః ।
భవేతాం యస్యచాశ్వస్సర్వావావర్తౌ లలాటకే ॥

శ్రీవత్సమనబడును. ఇట్టి గుఱ్ఱము రాజునకు సర్వార్థముల సాధించును. ఏగుఱ్ఱముయొక్క నొసటిభాగమున రెండు సుడులుండునో

శ్లో॥ రిపూన్జయతితత్స్వామీ ధనధాన్య సుపుత్రవాన్ ।
లలాటె త్రిభిరావర్తైర్యస్యనిశ్రేణి రస్తుహి ॥

అట్టి గుఱ్ఱమును స్వారిచేయు రాజు ధనధాన్య పుత్రవంతుడై శత్రువులను జయించుచుండును. నిచ్చెనమెట్లవలె గుఱ్ఱము నొసటిభాగమున మూడు సుడులుండునో

శ్లో॥ లభతే వాజినాతే ధనధాన్య జయాన్నృపః ।
సవ్యావర్తైశ్చతుర్భిస్తులలాటస్థైస్తురంగమః ॥

అట్టి గుఱ్ఱముగల రాజు ధనధాన్యములుగలవాఁడై శత్రువులను జయిం చును. గుఱ్ఱమునొసటి భాగమున చిన్నగా నాలుగు సుడులుండిన యెడల

శ్లో॥ వరుతేస్వామినం సద్యః పుత్రవంతం మహీపతిం ।
ఆవర్తావృషాభా భాతుకర్ణ మూలముపాశ్రితౌ ॥

తన యజమానిని శీఘ్రముగా బుత్రవంతునిగ జేయును. రెండు చెవుల మీద సుడులుండిన

శ్లో॥ భవతాంయుస్స తత్స్వామీలభతే భూషణానిచ ।
ఏవమాదిసుభావర్తై రంకితా అశ్వపుంగవాః ॥

తనయజమానికి అలంకారములనిచ్చును. ఇటువంటిశుభముగల సుళ్ళున్న గుఱ్ఱము మిగుల శ్రేష్ఠమైనది.

## హయలీలావతి గ్రంథబోధ

శ్లో॥ వక్షోభవావర్త చతుష్టయస్స కంఠేభవాస్స చారోచమానః ॥
శ్రీవృక్షకౌనామహయస్సు భర్తుస్సుత్పుత్ర పౌత్రార్థవివృద్ధయేస్యాత్ ॥

వక్షస్థలమునందు జన్మించిన సుడికి చతుష్టయమనియు, కంఠమం దుండు సుడి యున్న గుఱ్ఱమునకు శ్రీవృక్షకియని పేరు.

శ్లో॥ వక్షస్థాక యస్త్రిస్రా ఊర్ధ్వా రోమాజయావహాః ।
ఆవర్తో రోచామానసస్తు స్వామినో జయవర్ధనః ॥

పై సుడి యజమానికి పుత్ర పౌత్రాభి మభివృద్ధిజేయును. ఊర్ధ్వరోమ ములు గల ముత్యపుచిప్పవంటి మూడుసుడులును, రోచామానము సుడియు యజమానికి జయము గలిగించును.

## గరుడపురాణ బోధ

శ్లో॥ గారుడీ॥ వాజినాంకంఠ దేశేతు విపులశ్శుక్తికాకృతిః ।
రోచామాన ఇతిఖ్యాతో భర్తుర్వైరి జయప్రదః ॥

గుఱ్ఱము కంఠప్రదేశమున ముత్యపు చిప్పవలె విస్తరించియున్న సుడికి రోచామానమని పేరు. యజమాని తన శత్రువులను జయించును.

శ్లో॥ యద్వాజినాం ముఖే వృత్తాస్త్రేతాగ్న్యాకృతికాస్త్రయః।
రోమజాస్యంతితత్స్వామీ సమరేష్వ పరాజయీ॥

ఏ గుఱ్ఱము ముఖమున త్రేతాగ్ని ఆకారముగా మూడుసుడులుండునో ఆ గుఱ్ఱపుయజమాని యుద్ధమందు పరాజయ మొందడు.

శ్లో॥ యశ్చాశ్వానాం గలోద్దేశేభిన్న శుక్తిపుటాకృతిః।
సవై దేవమణిర్నామ తద్భర్తుస్సర్వసంపదః॥

గుఱ్ఱపు గంగడోలుప్రదేశమున ముత్యపుచిప్పవలె సుడియుండిన యజమానికి సర్వసంపదలనిచ్చును.

శ్లో॥ కంఠపార్శ్వే తురంగాణాం వక్రశ్చంద్రకనామకః।
రోమజోయది తన్నిత్యం సకలాభీష్టదాయికః॥

కంఠపార్శ్వమున చంద్రకళవలె సుడియుండిన దానికి చంద్రకమని పేరు. ఇది సకల అభీష్టములనిచ్చును.

శ్లో॥ ప్రోథే(గేతు తురంగాణాం ప్రఫుల్లకమలాకృతిః।
రోమజోయ యదితత్స్వామీ సకలాభీష్టభాగభుక్॥

ముక్కురంధ్రములమధ్య వికసించిన పద్మమువలె సుడియుండినచో యజమానికి సకలసంపదలనుగూర్చును.

శ్లో॥ అపాంగవర్తినా ద్వౌతువాజీనాం చామరాకృతీ।
ధనధాన్య చిరాయుష్యకీర్తి పుత్రప్రదౌ నృణాం॥

గుఱ్ఱము నేత్రములచివర విసనకర్రవలె సుడియుండిన యజమానికి ధనధాన్య చిరాయుష్యకీర్తి పుత్రపౌత్రాభివృద్ధిగ జేయును.

శ్లో॥ యశ్చాశ్వానాం ముఖావర్తో విస్తీర్ణః పంకజాకృతిః।
తేన స్వామీభవేన్నూనం సర్వభూమండలాధిపః॥

ఏ గుఱ్ఱముయొక్క ముఖమందు సుడియుండి పద్మమువలె వికసించియుండునో దానిస్వారి నిశ్చయముగా సకలభూమండలమున కధికారియగును.

శ్లో॥ గంగావర్త సమాకారో వాజీనాం గర్భ సంస్థితః।
గంగావర్త ఇతిఖ్యాతః పత్యుస్సంక్లేశనాశకః॥

గుఱ్ఱము గర్భభాగమున గంగావర్తమువలె పుట్టిన రోమజాలమునకు గంగావర్తమని పేరు. ఇది యజమానిదుఃఖముల పోగొట్టును.

శ్లో॥ యస్యాభినికటేచోక్తస్తదదూరేద్ధ్రువో బభౌ।
త్రివేణీసంగమం నామదద్భర్తా సతతం సుఖా॥

నాభికి సమీపమున సుడులుండిన త్రివేణి సంగమమని పేరు. ఆగుఱ్ఱపు స్వారి చాలసుఖముగా నుండును.

శ్లో॥ శుభాశుభా భ్రమకా యస్మిన్నవాజీ మధ్యమస్మృతః।
ముఖపాదసితః పంచకళ్యాణీశ్వస్య మాదతః॥

శుభాశుభములగు సుడులు ఒకగుఱ్ఱమునకు కలిగినచో దానిని మధ్యమ జాతి గుఱ్ఱమందురు. ముఖము, పాదములు తెలుపుగనున్న పంచకళ్యాణి యందురు.

శ్లో॥ తత్రాపీ సర్వతశ్వేతో మేధ్యః పూజ్యస్యదైవహి।
వైడూర్య సన్నిభే నేత్రే యస్యస్తోజపమంగళః॥

శరీరమంతా తెలుపురంగుగలది మిగుల శ్రేష్టమైనదియు, పూజ్యమైనదియు, పవిత్రమైనదియునగును. వైడూర్యమువంటి నేత్రములు గల గుఱ్ఱమునకు జపమంగళి మనబడును.

శ్లో॥ సఏవ హృదయేస్కంధే పుచ్ఛశ్వేతోష్టమంగళః।
కర్ణోభశ్యామశ్యామకర్ణ స్సర్వ తస్త్వేక వర్ణభాక్॥

హృదయము, భుజపార్శ్వములు, తోక తెలుపుగానున్నచో అష్టమంగళమందురు. చిత్రవర్ణము, పచ్చని, నలుపురంగుగల చెవులుకలదిగానుండినను, శరీరమంతటా ఒకేరంగుకలదియు నగు గుఱ్ఱముశ్రేష్టమైనది.

శ్లో॥ మిశ్రవర్గస్త్వేకవర్గః పూజ్య స్సా త్సుందరోయది।
కృష్ణపాదో హాయీనింద్య స్తదా శ్వేతకపాదపి॥

మిశ్రవర్గమైన ఒకరంగు కలిగినను, అతివికృతి ఆకారములేకుండ, అందముగానున్న పూజార్హ్వమైనది. నలుపురంగుగల పాదములుగల గుఱ్ఱము, ఒకపాదము మాత్రము తెలుపురంగుగల గుఱ్ఱము ఆక్షేపణీయమైనది.

శ్లో॥ రూక్షో దూసరవర్ణశ్చ గర్ధభాభోపినిందితః ।
కృష్ణతాళుః కృష్ణజిహ్వాః కృష్ణోష్ఠశ్చవినిందితః ॥

పరుషమై కొంచెము తెలుపురంగుగా నుందునదియు, గాడిదరంగు గలదియు ఆక్షేపణయందురు. దవుడలు, నాలుక, ఓష్టము నలుపు రంగుగా నుండినను

శ్లో॥ సర్వతః కృష్ణోవర్ణోస్తు పుచ్ఛశ్వేతస్తు నిందితః ।
ఉచ్చైః పదంన్యాసగతిర్ద్విప వ్యాఘ్రగతిశ్చయః॥

శరీరమంత నలుపురంగుగానుండి తోకమాత్రము తెలుపుగ నున్నను ఆక్షేపణయే. పాదము ఉన్నతముగానెత్తియుంచిన గమనము గలదై మద గజము, వ్యాఘ్రము

శ్లో॥ మయూరహంసతిత్తిర పారావతి గతిశ్చయః।
మృగోష్ట్రవానరగతిః పూజ్యో వృషగతిర్హ్వయః ॥

మయూరము, హంస, తిత్తిర, పారావతము, మృగోష్ట్ర, వానర, వృషభములవంటి గమనము గలిగిన గుఱ్ఱము శ్రేష్టమైనది.

శ్లో॥ అత్యంతభుక్త మిశ్రమితో పిపాసాదీన పీడ్యతే।
శ్రేష్ఠగతిస్తు సాజ్ఞేయా స్తశ్రేయస్తు రగోత్తమః ॥

బాగుగమేసి శ్రమనొందిన గుఱ్ఱము అధికాయాసముతో నుండక శ్రేష్టగమనము గలిగిన గుఱ్ఱము ఉత్తమోత్తమైనదని గ్రహించవలెను.

శ్లో॥ సుశ్వేతఫాల తిలకో విద్ధోవర్ణాంతరేణచ।
సజాపదళ భంజాతుయ స్సైవాతినిందితః ॥

గుఱ్ఱము నొసటి భాగమునందు తెలుపుచుక్కగలిగి, దేహమంతమరొక రంగుకలిగి యుండినచో ఆక్షేపణయే. దీనిని దళభంజియందురు.

శ్లో॥ సంహాత్సాద్వర్ణ జాన్దోషాన్నిష్య గ్ధవర్ణో భవేద్యది।
బలాధిక్యశ్చ సుగతిర్మహాన్స్యాద్వాంగసుందరః॥

రంగువలన బుట్టిన దోషములతో గూడియుండినను, నునుపగురంగు, బలమధికము, శ్రేష్ఠమైన గమనము, సుందరమైన అవయవములు

శ్లో॥ నాత్రి క్రూరస్యవా పూజ్యో భ్రమోద్యైరపిమాషితః।
వాజినామత్సవహానాత్య దోషాస్యం భవంతిహి॥

గలిగి అతిక్రూరముగానుండి, తప్పుసుడులున్నను ఆగుఱ్ఱమును ఎల్లప్పుడు పూజింపవలయును.

## అశ్వవిదానమను గ్రంథము

శ్లో॥ యః కోవావర్ణేన శ్వేతేన చవుంద్రమండలేనయుతః।
పతిమత్సంతం వాజీసర్వార్థ సౌఖ్యసంపన్న॥

ఏరంగు గుఱ్ఱమైనను ముఖమున తెలుపుమచ్చ యున్నయెడల చిరాయువుగలదై తన యజమానికి సకలయభీష్టములు తీర్చును.

## ప్రసంగరత్నావళియను గ్రంధము

శ్లో॥ కర్ణపుచ్ఛపథకేసర కృష్ణోయోన్యతస్తు.కలదౌతసవర్ణః।
ఇంద్రనీల ఇతివిశ్రుతవామాభూభృతాం వితనుతేశ్రేయమశ్వః॥

చెవి, తోక, జూలు, నలుపురంగుగానుండి మిగిలిన భాగమంతయు బంగారురంగుగల గుఱ్ఱములు ఇంద్రనీలమణియని పేరుగాంచి రాజులకు సర్వ సంపదల గూర్చును.

## హైలీలావతీయను గ్రంథము

శ్లో॥ శ్వేతాస్సుర్బ్రాహ్మణాశ్శోణాం క్షత్రియాపింగళావిశః।
కృష్ణవర్ణాస్తు శూద్రాస్యుర్మిశ్రవర్ణాస్తు సంకరాః॥

శ్వేత, రక్త, పీత, కృష్ణ, మిశ్రమరంగులుగల గుఱ్ఱములు క్రమక్రమముగా బ్రహ్మక్షత్రియ, వైశ్య, శూద్ర సంకరజాతులనియు

శ్లో॥ సర్వాంగధవళః కర్కః శోణ స్సర్వాంగలోహితః।
సర్వాంగకృష్ణో హేమాఖ్యః స్సర్వపీతాస్తుపింగళః॥

సకలావయధవళమగు గుఱ్ఱము కర్కమనియు, సకలావయవములు రక్త వర్ణములు కలిగియుండిన గుఱ్ఱము శోణమటులయనియు, నలుపురంగుగలది హేమమనియు, పీతవర్ణమంతటను కలిగినది పింగళమనియు పిలువబడును.

శ్లో॥ సర్వశ్వేతో జయకరస్సర్వ కృష్ణోభయావహః।
సర్వగాత్రేణాన్యవర్ణః పదేనైకేనపాండురః॥

అవయవములన్నియు తెలుపుగానున్నగుఱ్ఱము జయప్రదము. అవయవములన్నియు నలుపురంగుగానున్న గుఱ్ఱము భయమునిచ్చును. పాదమొకటి తెలుపుగానుండి తదితరభాగములు మరొకరంగుగా నున్నచో

శ్లో॥ విషపాదీతిసఖ్యాతః పత్యుర్నిత్యభయప్రదః।
మార్జాలకాకపాషాణ ఘూక వర్ణా భయావహాః॥

విషపాదియందురు. యజమానికి నిత్యము భయమునిచ్చును. పిల్లివలె, కాకివలె, పాషాణమువలె, గుడ్లగూబవలె రంగుగల గుఱ్ఱములు యజమానికి భయమునిచ్చును.

శ్లో॥ మయూరతిత్తిరశుకప్రఖ్యా మిశ్రాశ్శుభావహాః।
శ్యామాశ్శోణిటలేయస్తు శ్వేత పుండ్రేన సంయుతః॥

నెమలి, తీతిక, చిలుకవంటి మిశ్రమరంగులుగల గుఱ్ఱములు శుభమును గలిగించును. శ్యామవర్ణముగల గుఱ్ఱముయొక్క ముఖము తెలుపుగనుండిన శ్రేష్ఠము.

## పరాశర సంహిత

శ్లో॥ దీర్ఘగ్రీవాక్షికూటత్రికహృదయపృధుస్తామ్రతాల్వోష్ఠ।
జిహ్వాసూక్ష్మత్వక్కేశవాల స్సుశఫగతి ముఖోహ్రస్వకర్ణోష్ఠపుచ్ఛః॥

కంఠము, నేత్రస్థానము పొడవున, వీపువెనుకభాగమునసుండు ఎముకలు, వెన్నెముక, వక్షస్థలము విశాలముగను, దవుడలు, పెదవులు, నాలుక

ఎరుపుగానుండి చర్మము, వెంట్రుకలు, తోక, మృదువుగానుండి, మంచి డెక్కలుగలిగి, చక్కని ముఖముగలిగి, చెవులు, పెదవులు, తోక

శ్లో॥ జంఘా జానూరువృత్త స్యామశితదశనశ్చారు సంస్థానరూపో।
వాజీసర్వాంగశుద్ధోభవతినరపతేశ్శత్రు నాశాయనిత్యం॥

పరుచగానుండి, పిక్కలు, తొడలు, ధవళముగానుండి, సమముగానుండు పరుసగలిగిన దంతములుగలిగి, సుందరమైన సంధులుగలఆకారముతోనుండిన గుఱ్ఱము శత్రుజయమును తనయజమానికిచ్చును.

## తదితర సుళ్ళు

శ్లో॥ నాసికాగ్రే లలాటేచ శంఖే కంఠేచ మస్తకే।
ఆవర్తా జాయతే ఏషాంతే ధన్యా స్తు రగోత్తమాః॥

ముక్కునకు చివరభాగమున, నొసట, ఎముకమీద, కంఠమున, శిరస్సు భాగములందు సుడులుపుట్టిన గుఱ్ఱముచాలా శ్రేష్టము.

శ్లో॥ హృదిస్కంధే గళేచైవ కటిదేశే తథైవచ
నాభౌ కుక్షౌచ పార్శ్వాగ్రే మధ్యమాస్సం ప్రకీర్తితాః॥

హృదయమున, భుజశిరములందున, గళమున, పిరుదులమీద,నాభిమీద, కుక్షిభాగమందు, పార్శ్వములందున సుడులుండిన మధ్యమాశ్వ మనబడును.

శ్లో॥ లలాటేయస్య చావర్త ద్వితయస్య సముద్భవః।
మస్తకేచ తృతీయస్య పూర్ణ హర్షోయ ముత్తమః॥

నొసటి భాగమున రెండు సుడులును, శిరస్సున మూడుసుడులును, యున్న గుఱ్ఱము యజమానుని హర్షింపజేయును.

శ్లో॥ పృష్ఠ వంశేయదావర్తో యస్యైకస్సంప్రజాయతె।
సకరోత్యశ్వ సంఘాతాన్ స్వామిసూర్య సంజ్ఞికః॥

వెన్నుపూసయందొక సుడి పుట్టిన గుఱ్ఱమునకు సూర్యుడని పేరు. ఇట్టిది తన యజమానికి అనేక గుఱ్ఱములను సంపాదింప జేయును.

శ్లో॥ త్రయోయస్యలలాటస్థా ఆవర్తాస్తిర్యగుత్తరాః।
త్రికూటస్యపరిజ్ఞే యోవాజివృద్ధి కరస్సదా॥

నొసటియందే గుఱ్ఱమునకు మూడుసుడులు అడ్డముగాను, ఉత్తరముగానుండునో అది త్రికూటసంజ్ఞ కలదియై గుఱ్ఱములను వృద్ధిపొందించును.

శ్లో॥ ఏవమేవప్రకారేణ త్రయోగ్రీవాం సమాశ్రితాః।
సమావార్తా స్సవాజిశో జయతే నృపమందిరే॥

ఈరీతిగనే మూడుసుడులు కంఠమునందు సమానముగా నుండిన గుఱ్ఱము రాజగృహమందున శ్రేష్ఠమైనదై యుండును.

శ్లో॥ కపోలస్థౌ యథావర్తౌ దృశ్యేతే యస్యవాజినః।
యశోవృద్ధికరౌ ప్రోక్తౌ రాజ్యవృద్ధికరౌమతౌ॥

ఏ గుఱ్ఱముయొక్క గండస్థలములందు రెండు సుడులుండునో దాని ప్రభువునకు రాజ్యవృద్ధియు, కీర్తియుగలుగును.

శ్లో॥ సహృద్వామాశ్రితః క్రూరః ప్రకరోతిధనక్షయం।
ఇంద్రాక్షౌతావుభౌశస్తౌ నృపరాజ్య వివృద్ధిదౌ॥

హృదయముయొక్క వామభాగమునందు సుడియున్న క్రూరముగలదై ధనక్షయమొనర్చును. వక్షస్థలముయొక్క రెండుభాగములందును సమానముగానుండెడు సుడులను ధాత్షములందురు. ప్రభువునకు రాజ్యవృద్ధిజేయును.

శ్లో॥ కర్ణమూలే యథావర్తౌస్తనమధ్యే తథాపరౌ।
విజయాఖ్యౌ వుభౌ తౌతు యుద్ధకాలేయశఃప్రదౌ॥

చెవులచివర, స్తనములమధ్యను సమానముగా రెండుసుడులున్నచో అట్టివి విజయమును కలిగించునవియై యుద్ధకాలమున ప్రభువునకు శాశ్వతకీర్తిని సంపాదింపజేయును.

శ్లో॥ స్కంధపార్శ్వే యథావర్తౌ సభవేత్పుణ్యలక్షణః।
కరోతివివిధాన్పుణా న్స్వామినస్సతతం సుఖం॥

భుజపార్శ్వములయందు సుడులుండిన అది పుణ్యలక్షణములుకలదై సమస్తపుణ్యములను సౌఖ్యమును ఎల్లపుడు యజమానికి కలుగజేయును.

శ్లో॥ నాసామధ్యేయదావర్త ఏకోవాయదివాత్రయం।
చక్రవర్తీ సవిజ్ఞేయో వాజిభూపాలసంజ్ఞకః॥

ముక్కుయొక్క మధ్యభాగమున మూడుగాని, ఒకటిగాని సుడులుండిన చక్రవర్తియను పేరుగలదై ఆగుఱ్ఱము భూపాలమను పేరున పిలువబడును.

శ్లో॥ శుక్లాఖ్యా పాలకంఠస్థా ఆవర్తా వృద్ధికీర్తిదా।
యస్యావర్తా వక్రగతా దృశ్యంతే వాజినోయది॥

కంఠమునను, నొసటిభాగమునను సరియైన సుడులుండిన శుక్లమని పేరుగాంచి యజమానికి కీర్తినిగలిగించును. అచ్చట నే వంకరగానున్నయెడల

శ్లో॥ నన్యానం మృత్యుమాప్నోతి కుర్యాద్వా స్వామినాశనం।
జానుసంస్థో యదావర్తః ప్రవాసక్లేశకారకః॥

అట్టిది యజమానుని నశింపజేయును. లేక ఆగుఱ్ఱమైన చనిపోవును. పిక్కలయందుండు సుడివలన యజమానికి కారాగృహముు రావచ్చును.

శ్లో॥ వాజిమేఢ్రే యదావర్తో విజయశ్రీనివాసనః।
త్రికసంస్థో యదావర్త స్త్రి వర్గస్య ప్రణాశనః॥

గుఱ్ఱముయొక్క మేఢ్రముమీద సుడియుండిన ప్రభువుయొక్క సంపదను, జయమునను నాశనము దెచ్చును. వెన్నెముకను చివర తోకభాగముయొక్క ఎముకలు రెండును కలసియుండిన స్థలమును త్రికమందురు. ఇచ్చట సుడియుండిన ధర్మార్థకామముల నశింపజేయును.

శ్లో॥ పుచ్ఛమూలేయదావర్తో ధూమకేతు ర నర్థన్ కృత్।
గుహ్యా పుచ్ఛత్రికావర్తీ సకృతాంతభయప్రదః॥

పుచ్ఛమూలము (తోక చివరభాగము) నందుండు సుడికి ధూమకేతు

వని పేరు. ఈసుడివల్ల యజమానికి నష్టముగలుగును. త్రికమందును, గుహ్యమ్మందును, తోకమీదనుయుండు సుడులు యమునివలె భయముగలిగించును.

శ్లో॥ మధ్యదండా పార్శ్వగమా స్సైవశతపదీకచే।
అతిదుష్టాం గుష్టమితా దీర్ఘదుష్టాయథాయథా॥

పార్శ్వమునందుండు సుడి మధ్యదండనమనబడును. అదియె కేశపాశమునందుండినచో శతపదియనబడును. ఇది అంగుళప్రమాణమైన అతిదుష్టము. అంగుళమునకు ఎక్కువగానున్నకొలది దుష్టత్వ మెక్కువగును.

శ్లో॥ అశ్రుపాతహనూగండ హృద్గలప్రోథవస్తిషు।
కటిశంఖ జానుముష్క కకున్నాభిగుథేషుచ॥

కన్నీరుపడు స్థలమున, దవుడలందు, చెక్కిళ్ళయందు, హృదయమందు మూతి, పొత్తికడుపు, పిరుదులు, నొసలున, అండమున, మూపురమున, నాభిని,

శ్లో॥ దక్షకుక్షౌ దక్షపాదే త్వశుభోభ్రమరంసదా।
గలమధ్యే పృష్ఠమధ్యే ఉత్తరోష్ఠే థరేతథా॥

దక్షిణకుక్షిని, కుడికాలున, సుడులుండిన మంచిది. కంఠము మధ్యభాగమున, వెన్నుమధ్య, పెదవులందు

శ్లో॥ కర్ణనేత్రాంతరే వామకుక్షౌ బైవతు పార్శ్వయోః।
ఊరూషుచ శుభావర్తో వాజినామాగ్ర పాదయోః॥

చెవులచివర, నేత్రముల చివర, వామకుక్షియందున, ముందటి కాళ్ళమీద సుడులుండిన శుభముగలిగించును.

శ్లో॥ ఆవర్తా సాంతరే ఫాలే సూర్యచంద్రా శుభప్రదా।
మాలితౌతా మధ్యఫలా హ్యతిలగ్నాతు దుష్ఫలా॥

నొసటినందు ప్రత్యేకముగా రెండు సుడులున్న యెడల వాటిని చంద్రసూర్యులందురు. ఇవి శుభము గలిగించును. కాని ఇవి వికాసము లేకున్న

మధ్యఫలితముగా నుండును. రెండుసుడులు కలసియున్నయెడల దుష్టఫలముల నిచ్చును.

శ్లో॥ త్రికోణత్రితయం ఫాలే ఆవర్తానాంతుదుఃఖదం।
గళమధ్యే శుభస్త్వేకస్సర్వా శుభనివారణః॥

ముక్కోణాకారముగ నొసటియందు సుడియుండిన దుఃఖము గలిగించును. కంఠమధ్యభాగమునందు ఒకసుడియున్న సకలశుభముల నివారించును.

శ్లో॥ మేఢ్రస్య పశ్చాద్భ్రమరీ స్తనీవాజీ స చా శుభః।
భ్రమః కర్ణసమీపేతు శృంగీ చైక స్య నిందితః॥

మేఢ్రముయొక్క పడమరభాగమున సుడియున్నను, స్తనములుండినను అశుభమగును. చెవిదగ్గరనుండు సుడికి శృంగియందురు. ఇదికూడ ఆక్షేపణయే.

శ్లో॥ జానుత్పాతో త్క్షేప వాద్యోధూతపృష్ఠో జిలాసనః।
గతమధ్యాసనః పృష్ఠపాతీపశ్చాద్గ మోర్ధ్వపాత్।
సర్ప జిహ్వాశ్చ ర్క్షవ కాంతిరశ్వ స్సాచ్ఛాతి నిందితః।
ఆ వర్త సామ్యాదావర్తో రోమ సంస్థాన మంగినాం॥

వెనుకకాళ్ళను విసరుట, పెదవులను వాయించుట, వెనుకకు నడపించుట, ముందరపాదము లెత్తినడచుట, పాముసాలుకవలె నాలుకను పైకి తీయుట, ఎలుగుబంటి రంగుకలిగియుండుట, నొసటభాగమున బొట్టు తప్పగా నుండుట ఈలక్షణములుగల గుఱ్ఱములను సంపాదించిన యజమానుని నిందితులుగా జేయును.

## మరికొన్ని ముఖ్యవిషయములు

గుఱ్ఱములెక్కువగా నే రాజువద్ద యుండునో ఆరాజు చతుస్సముద్ర ముద్రితధరావలయంబు పరిపాలించుచు, యశస్సాంద్రుడై, లక్ష్మీయుతుడై సర్వసౌఖ్యముల నొందుచుండును.

సర్వ శుభలక్షణములను గలిగిన గుఱ్ఱము ఏమానవుని యింట ఒక దిన మున్నను, ఆమానవునకు అధికమగు సంపదలు లభించి స్థిరమై నిలిచి యుండును. రాజ్యభోగములు అశ్వముల చేత లభించును. రాజ్యము వలన ధర్మార్థకామ మోక్షములును, చతుర్విధఫలంబులును లభించును.

గుఱ్ఱమునకు పది సుడులుండవలెను. పదికంటె తక్కువగానున్న గుఱ్ఱము తక్కువకాలము జీవించును. ఇంతియేగాక యజమానికికూడ కీడు గల్గును.

చిన్నతలగల గుఱ్ఱమును పెక్కు చిక్కులకులోనై అయిదు సంవత్స రములలోనే మరణించును.

మెడమీదనుండు జూలునందు సుడియును, దేవమణియను సుడియును గల గుఱ్ఱము యితర దోషములను పోగొట్టి శుభముల నొసంగును.

రోచామానముక్రింద జెర్రివలెసుడియున్న శతపదియందురు. గుఱ్ఱము యొక్క అవయవములందు తప్పక సుడియుండవలెను. ఆసుళ్ళు విచ్ఛిన్నము గాక యుండవలెను. ఒకొక్కసుడి రెండవదానికి తాకి దానిని వికలమగు నట్లు చేయకుండ నుండవలెను.

అశుభసూచికంబులగు సుళ్ళు అధికముగను, శుభసూచకములగు సుళ్లు స్వల్పముగనున్న అశ్వమును కొనరాదు. శుభసూచకము లధికముగా నున్న పరిశీలించి దాని నెక్కవలయును. గుఱ్ఱమునకు ముందటికాళ్ళు సన్న ములై యుండుట మేలు.

తోకయు, కాళ్ళు, కంఠము, ముఖము, చెవులు, మెడభాగములు మిగుల పొడవుగానుండిన గుఱ్ఱము మిక్కిలి జవసత్వముగలదగును.

కాళ్ళు, జంఘములు, కటిప్రదేశము, ముఖము, తోక, చెవులు కురచగా నున్న గుఱ్ఱము వేగముగా పోవునదిగాకున్నను బలముగలదియగును.

వృషణములు పొట్టిగానుండి ఎండినట్లుండిన గుఱ్ఱమును ఎంతధనమును హెచ్చించియైనను కొనవచ్చును.

ఏడుదంతములు గలదానిని, బలము, జవములేనిదానిని, కాంతిలేనిదానిని భూపతులెక్కరాదు.

బలమైనట్టియు, కురుచగానున్నట్టియు వీపును, బలమునుగలిగి లావైన మధ్యమును, పొడుగగు తోకయు గలిగిన గుఱ్ఱము మంచిది.

ఆడగుఱ్ఱము ముఖమువలెనున్న మొగగుఱ్ఱము శుభములనిచ్చును. ఎక్కువగ మూత్రమును విడచుగుఱ్ఱముకూడ దోషముగానెంచుదురు.

చిన్నతలగలిగియుండి, సుడులు లేక మొండిదిగా నుండు గుఱ్ఱము చాలా ఏచమైనది. ముప్పది సుళ్ళకు తక్కువగా నున్న గుఱ్ఱము ఎక్కువ కాలము బ్రతుకదు, సుడి రెండుగా తెగిన గుఱ్ఱముకూడ ఆక్షేపణయే.

కుడివైపున నుండవలసిన సుడి ఎడమవైపునను, ఎడమవైపున నుండవలసిన సుడి కుడివైపునను యున్న గుఱ్ఱము యజమానుని ధనహీనునిగ జేయును. దవుడలందు రోమములుగల గుఱ్ఱము మిక్కిలి దారిద్ర్య మొనగూర్చును.

తల, తోక, కాలిన చర్మముల వాసనగలిగిన గుఱ్ఱములను విడిచిపెట్టవలెను. గుఱ్ఱమునకు ఒకేపర్యాయము రెండుపిల్లలు పుట్టినచో ఆ గుఱ్ఱమును ఇంట నుంచరాదు. నేత్రకూటములందు రోమములుగలిగిన గుఱ్ఱము యజమానిని మనోరోగముల పీడింపజేయును.

---

# ప్రాచీన అశ్వ వైద్యము

## హేమసూరి గ్రంథకర్త

## 14 వ శతాబ్దమునాటి సంస్కృత గ్రంథము

## సుళ్ళలోని రకములు

### మొదటితరగతి గుఱ్ఱములు

### శుభమును కలిగించు సుళ్ళు, రంగులు, గుణములు

### వాహనాథ

గుఱ్ఱముయొక్క నొసటి భాగమున మూడుసుడులు నిలువుగానుండును. శరీరము తెలుపురంగుగానుండి బలముగానుండును. అద్భుతముగా పరుగెత్తును. నీటిలో ఈదును. యజమానుని ఆరోగ్యవంతునిగ, కీర్తివంతునిగ జేయును. ఎండను, వానను, చలికి ఓర్చుకొనును. దీనిని వాహనాథయందురు. ఈజాతి పారశీక దేశములో నుండును.

### తురంగమ

గుఱ్ఱముయొక్క నొసటిభాగమున మూడు సుడులు ముక్కోణాకారముగ నుండును. ఈజాతి శరీరము తెలుపురంగుగలేక నలుపురంగుగలేక ఎరుపురంగుగనుండును. అంతపొట్టిగ ఎత్తుగ నుండక సమానముగానుండును. స్వారిచేయుటలోను, దుముకుటలోను, దాట్లువేసి పరుగెత్తించుటలోను, వేటకు, యుద్ధమునకు ఉపయోగపడును. ఇవి ఎండను, చలికి, వానను ఓర్చుకొనును. దానిని తురంగమయందురు.

### మహోధని

గుఱ్ఱముయొక్క నొసటిభాగమునందు గుండ్రని ఆకారముగా నొకసుడియుండును. శరీరము తెలుపులేక ఎరుపురంగుగానుండి తోకమరచగా

నుండును. యజమానిని కీర్తివంతునిగ, ఆరోగ్యవంతునిగజేయును. మహా రాజులు, రాజులు, సంపన్నులు స్వారికి, వేటకు, యుద్ధమునకు ఉపయోగించు దురు. దీనిని మహాధనియందురు.

## అశ్వపతి

గుఱ్ఱము నొసటిభాగమున ఒకదానిక్రింద నొకటి వంతున రెండు సుడు లుండును. ఈ జాతి పొడుగుగా, అందముగా, తెలుపురంగుగానుండి కళకళ లాడుచుండును. చక్కని నేత్రములు గలిగి పరిశుభ్రముగాబలముగానుండును. దీని అరపు వీనులకింపుగా నుండును. యజమానిని అదృష్టవంతునిగ, తేజో వంతునిగజేయును. యుద్ధమునకు, స్వారికి ముందు దూకును. దీనినిఅశ్వపతి యందురు.

## శిరోమణి

గుఱ్ఱముతల మధ్యభాగమున ఒకసుడియుండును. శరీరము ఎరుపు రంగుగా నుండును. విసుగు విరామములేక ఎల్లపుడు ప్రయాణము చేయును. కన్నులు, ముఖము చూచుటకు అందముగా నుండును. యజమానిని ఆరోగ్య వంతునిగ, బలముగ, పౌరుషవంతునిగ జేయును.

## గాంధర్వ

గుఱ్ఱము రెండు చెవుల క్రింది భాగములందు రెండు సుడులుండును. విశాలమగురొమ్ము, తెలుపురంగుగల తోక, చురుకుదనముగలచెవులు, చక్కని నేత్రములు, సూక్ష్మమగు మూత్రపిండములు గలిగియుండును. యజమానికి సర్వసంపదల నిచ్చును. దానిని గాంధర్వయందురు.

## దేవేశ

గుఱ్ఱము నొసటిభాగమున చతుర్భుజాకారముగా నాలుగు సుడులు ఒకేచోట యుండును. ఈ జాతి శౌర్యవంతముగ, పెద్దదిగ, ఆరోగ్యవంత

ముగనుండును. ఎట్టిపనినైనను నిరభ్యంతరముగ జేయును. యజమానిని ఆరోగ్య వంతునిగను, సుఖవంతునిగ జేయును. దీనిని దేవేశ యందురు.

## దే వ మ ణి

గుజ్జము మెడ భాగమునకు కొంచెము దగ్గరగా ఒకచక్కని సుడి యుండును. దీనినే దేవమణియందురు. శరీరము తెలుపుగను, నేత్రములు విశాలముగను, చెవులు కురచగను, తోక పొడవుగను, చాలాఎత్తుగను ఉండును. సుకుమారమైన శరీరముగలిగియుండును. స్వారికి, వేటకు, సర్దారుకు ఉపయోగపడును యజమానిని కీర్తివంతునిగ జేసి సుఖసంపదల నిచ్చును. ఖరీదు జాస్తిగానుండును. దీనిని దేవమణియందురు.

## రో చా మా న ము

గుజ్జము నొసటిభాగమున గోధుమగింజాకారముగ రెండుసుడులుండును. శరీరము ఎరుపులేక తెలుపురంగుగానుండి చాలాఎత్తుగానుండును. స్వారిలో పడగొట్టదు. యజమానిని పుత్రపౌత్రాభివృద్ధిగాజేయును. ఎట్టిపనినైనను నిరాకరించక సంతోషముగాజేయును.

## యు ద్ధా రి

గుజ్జము మెడక్రిందిభాగమున ఒక సుడియుండును. శరీరము నలుపు రంగుగను, తోక, జూలు పొడవుగనుయుండును. చాల నమ్మకముగా, విశ్వాసవంతముగా నుండును. సకిలింపు వీనులకింపుగానుండును. యజమానికి సర్వసంపదనిచ్చును. ఆపదలనుండి రక్షించును. దానిని యుద్ధారియందురు.

## వి వి ధా చా రి

గుజ్జము పొట్టభాగపు ఒకవైపునగాని, రెండువైపులగాని ఒకటిలేక రెండు సుళ్ళుండును. శరీరము ఎరుపుగలేక తెలుపుగలేక తదితర రంగులుగ నుండును. వేటకు, యుద్ధములకు, కష్టమైన పనులకు ఉపయోగపడును. అవు

సరమున్న ఈవగలదు. యజమానుని ధనకనక వస్తువాహనునిగజేయును. దీనిని వివిధాచారియందురు.

## ది క్పా ల

గుఱ్ఱము రొమ్ముమధ్యభాగమున చతుర్భుజాకారముగ నాలుగు సుడు లుండును. శరీరమంతా తెలుపుగునుండి, నేత్రములు బంగారురంగుగానుండును. ఎండకు, చలికి, వానకు ఓర్చుకొనును. మహారాజులు, రాజులు స్వారికొరకు, సరాగా ఉపయోగించుదురు. కాని వీనికి నెమ్మదిగానడచు ఉపాయము తెలి యదు. దీనిని దిక్పాల యందురు.

## న వ మూ ర్తి

గుఱ్ఱము రొమ్ముమధ్యభాగమున రోచామానమువలె రెండు గోధుమ గింజలాకారముగ రెండు సుడులుండును. దేవమణికంటె బలముగాను, శరీర మంతా ఎరుపురంగుగను యుండును. యుద్ధమునకు, వేటకు ఉపయోగపడును. యజమానుని కీర్తివంతునిగ; ధనవంతునిగ జేయును.

## తా ర క

గుఱ్ఱము రొమ్ముమీదగాని, కడుపుమీదగాని విష్ణుపాదపు ఆకారముగా ఒకటిగాని రెండుగాని సుడులుండును. ఇట్టిగుఱ్ఱము చాలావరకు జీవించును. శరీరము తెలుపుగలేక ఎరుపుగనుండి చాలా పరిశుభ్రముగనుండును. అన్నిపను లకు ఉపయోగపడును. యజమానుని సుఖవంతునిగ, పుత్ర పౌత్రాభివృద్ధిగ జేయును. దీనిని తారకయందురు.

## చ ం ద్ర క

గుఱ్ఱమురొమ్మునగాని, కడుపునకు కొంచెము దగ్గరగాగాని శంఖు లేక చక్రముఆకారముగా సుడియుండును. శరీరము తెలుపు, లేక ఎరుపు లేక నలుపు రంగుగా నుండును. యజమానికి సమస్తకోరికలనిచ్చును. కన్నులు విశాలముగ,

చెవులు సన్నితముగనుండును. అన్ని జంతువులయందు కరుణగలిగి యుండును. దీనిని చంద్రక యందురు.

## బా ణ పు సు డి

గుఱ్ఱము పొట్టభాగమునకు ఒకవైపునగాని రెండువైపులగాని విల్లు లేక బాణపుఆకారముగా సుడి యుండును. దీనిని జయప్రదయందురు. యజమానుని కీర్తివంతునిగ ధనవంతునిగ జేయును. పందెములకు, దూపటకు ముందంజ వేయును. శత్రువులను జయించును.

## తామరాకు సుడి

గుఱ్ఱము నొసటిభాగమున తామరాకువలె సుడియుండును. ఇదిచాలా శ్రేష్ఠమైనది. యజమానుని భాగ్యవంతునిగ కీర్తివంతునిగజేయును. స్వారి మిక్కుటముగా జేయును.

## ఘటపు సుడి

గుఱ్ఱము నొసటిభాగమునందు కుండ ఆకారముగ సుడియుండును. శరీరము ఎరుపురంగుగానుండును. యజమానుని, భార్య బిడ్డలను ధనవంతులుగ, సుఖవంతులుగ జేయును. యజమాని యిష్టప్రకారము నడచును.

## నాగలి సుడి

గుఱ్ఱము నొసటి భాగమునందు నాగలి ఆకారముగా సుడియుండును. యజమానుని గొప్ప భూస్వామిగజేయును.

## క ఱ్ఱి సు డి

గుఱ్ఱము కన్నులమధ్యనుంచి ముక్కు, పెదవులవరకు తెలుపు మచ్చ గల కఱ్ఱిఆకారముగా సుడియుండును. యజమానుని ధనవంతునిగ, సుఖవంతునిగ జేయును. శరీరము తెలుపుగానుండి వివిధరంగుల మచ్చలుండును. ఎండకు, వానకు, చలికి ఓర్చుకొనును.

## జెండా సుడి

గుఱ్ఱము నొసటిభాగమున జెండా ఆకారపుసుడియుండును. శరీరము నలుపురంగుగానుండి యజమానిని సకలసంపదలతో తులతూగించును.

## అంకుశపు సుడి

గుఱ్ఱము నొసటిభాగమున అంకుశపు ఆకారముగా సుడియుండును. శరీరము నలుపురంగుగను, నేత్రములు, ముఖము అందముగను, తోక మృదువుగ పొడవుగనుండును. యజమానుని పుత్రపౌత్రాభివృద్ధిగ జేయును.

## అద్దపు మచ్చ

గుఱ్ఱము నొసటిభాగమున అద్దపు ఆకారముగ తెలుపుమచ్చయుండును. శరీరము నలుపు లేక ఎరుపురంగుగానుండును. యజమానుని వృద్ధిలోనికి దెచ్చును.

## వృ క్షా కా ర పు సు డి

గుఱ్ఱము నొసటి భాగమున వృక్షాకారముగ సుడియుండును. శరీరపు రంగు మచ్చలు మచ్చలుగా నుండును. యజమానియందు భక్తివిశ్వాసములు కలిగి మహారాజునిగ జేయును.

## శ ం ఖు సు డి

గుఱ్ఱము నొసటిభాగమున శంఖపు ఆకారముగా సుడియుండును. ఈ గుఱ్ఱపుసకిలింపు శంఖు ధ్వనివలెనుండును. యజమానికి సర్వసంపదలగూర్చును. ప్రతిపనిలో జయించును.

## చ క్రా కా ర పు సు డి

గుఱ్ఱము నొసటిభాగమున చక్రము ఆకారముగా సుడియుండును. ఇది ప్రశస్తమైనజాతి. శరీరము నీలిరంగుగానుండును. స్వారిలో నిపుణత్వము కలిగి బలముగా నుండును. వండిన ఆహారపదార్థములు, మిఠాయి వగైరా తినును. యజమానుని, భార్యపుత్రులను ధనసంపదలతో తులతూగించును.

## కిరీటాకారపు సుడి

గుఱ్ఱము నొసటి భాగమున విసనకర్ర ఆకారముగ సుడియుండును. శరీరము ఎరుపురంగుగానుండును. ఎండను, చలికి, వానను ఓర్చుకొనును. యజమానిచేయు ప్రతికార్యమును జయించును.

## విసనకర్రాకారపు సుడి

గుఱ్ఱము నొసటి భాగమున విసనకర్ర ఆకారపు సుడియుండును. శరీరము ఎరుపు లేక నలుపు రంగుగానుండును. తోకపొడవుగా మృదువుగా నుండును. వేటకు యుద్ధమునకు ఉపయోగపడును. యజమానికి పెక్కుమంది భార్యలు పిల్లలు కలిగి కీర్తివంతులుగ నుందురు.

## నక్షత్ర సుడి

గుఱ్ఱపు నొసటి భాగమున నక్షత్రపు ఆకారముగ సుడియుండును. శరీరము ఎరుపురంగుగ లేక నలుపురంగుగనుండును. ఎండకు వానకు చలికి ఓర్చుకొనును. ఈ జాతి కాపలా కాచును. యజమానుని కీర్తివంతునిగ, ధనవంతునిగ జేయును.

## సూర్యుడాకారపుసుడి

గుఱ్ఱము నొసటిభాగమున సూర్యుడు ఆకారముగ సుడియుండును. శరీరము ఎరుపురంగుగానుండును. రాజులు, జమీందారులు, సంపన్నులు యుద్ధమునకు ఉపయోగించుదురు.

## చంద్రుడాకారపుసుడి

గుఱ్ఱము నొసటిభాగమున చంద్రుడు ఆకారముగ సుడియుండును. శరీరము నలుపుగ లేక ఎరుపుగనుండును. యజమానిని వృద్ధిలోనికి తెచ్చును. వేటకు యుద్ధమునకు ఉపయోగపడును.

## గొడుగు ఆకారపుసుడి

గుఱ్ఱము నొసటిభాగమునందు గొడుగు ఆకారముగా నుండును. శరీ

రము ఎరువు లేక నలుపురంగుగ నుండును. ఎండకు, వానకు, చలికి ఓర్చు కొనును. యజమానిని వృద్ధిలోనికి దెచ్చును.

## పద్మపుసుడి

గుఱ్ఱము నొసటిభాగమున తామరపువ్వు ఆకారముగ సుడియుండును. శరీరము ఎరుపుగ, మెడకాళ్లు ఎత్తుగా బలముగనుండును. యజమానుని ధన వంతునిగ జేయును.

## గృహాపుసుడి

గుఱ్ఱము నొసటిభాగమున ఇంటి ఆకారముగల ఎనిమిదియిండ్లుగల ఆకారముగానుండును. శరీరము నలుపురంగుగా నుండును. యజమానుని ధనవంతునిగ జేయును.

## నిచ్చెనసుడి

గుఱ్ఱము నొసటిభాగమున నిచ్చెన ఆకారముగా సుడియుండును. శరీరము ఎరుపురంగుగానుండును. యజమానిని సంతోషపెట్టును.

## రథముసుడి

గుఱ్ఱము నొసటిభాగమున రథము ఆకారముగా సుడియుండును. ఈదును. యుద్ధమునకు వేటకు ఉపయోగపడును. యజమానుని సంతోష పెట్టును.

# శరీరచ్ఛాయ భేదములు

## దే వ భూ తి

ఈజాతిగుఱ్ఱము శరీరమంతా తెలుపుగానుండి చెవులు సున్నితముగా, నేత్రములు అందముగా, ముఖము సొగసుగా విశాలముగానుండును. యజమా నుని ధనవంతునిగ జేయును.

## అ మ రే శ

గుఱ్ఱము మెడభాగము మాత్రము తెలుపుగానుండి తదితరభాగములు ఎరుపుగానుండును. ఇది యజమానుని పుత్రవంతునిగ జేయును.

## క లి హా రి

గుఱ్ఱము ముఖము తెలుపుగానుండి తదితర భాగములు ఎరుపురంగుగా నుండును. యజమానుని భాగ్యవంతునిగ, పుత్రవంతునిగ జేయును.

## సు ఖ దా

గుఱ్ఱము కడుపుభాగము తెలుపురంగుగను, తక్కిన భాగములు ఎరుపు గుగాని నలుపురంగుగాని యుండును. యజమానికి సర్వసంపదల సమ ర్చును.

## న ష్టా రి

గుఱ్ఱము చెవులు, నాలుగుకాళ్ళు, సూకాళ్ళనుంచి గిట్టలవరకు తెలుపు రంగుగానుండి, తక్కినభాగములు ఎరుపుగలేక నలుపుగనుండును. ఇది యజ మానుని కీర్తివంతునిగజేయును.

## కృ ష్ణ క

గుఱ్ఱము శరీరమంతా నలుపురంగుగానుండి చాలాఅందముగానుండును. యజమానుని వృద్ధిలోనికి తెచ్చును.

## అష్ట మంగళ

గుఱ్ఱము తల ముఖము రొమ్ము తోక తెలుపురంగుగాను, నాలుగు కాళ్ళు ఎరుపురంగుగానుండును. తక్కిన శరీరమంతా నలుపురంగుగానుం డును. యజమానుని సంతానవృద్ధిగ, కీర్తివంతునిగజేయును.

## హా య రా జ

గుఱ్ఱము రొమ్ముమీద నల్లనిమచ్చయు, తక్కిన భాగములు ఎరుపు రంగుగా నుండును. యజమాని శత్రువులు దుఃఖించుదురు.

## పంచతరు

గుఱ్ఱము కడుపుభాగము తెలుపురంగుగను, తక్కినభాగములు ఎరుపు రంగుగనుండును. యజమాని కోరిన కోరికల నిప్పించును.

## అఖండల

గుఱ్ఱము సగభాగము తెలుపు రంగుగను, సగభాగము ఎఱుపురంగుగను యుండును. ఇది యజమానుని భాగ్యవంతునిగ జేయును.

## బహుకేళి

గుఱ్ఱము రొమ్ము,ముఖము, తెలుపురంగుగను, తక్కినభాగములు ఎరుపు రంగుగను యుండును. కదనుత్రొక్కును. యజమానుని ఆరోగ్యవంతునిగ సుఖవంతునిగ జేయును.

## సారవేగి

గుఱ్ఱము చెవులనుంచి కన్నులవరకు, ముఖభాగమంతా తెలుపురంగుగా నుండి తదితర భాగములు నలుపు లేక ఎరుపురంగుగ నుండును. ఇది యజమానుని సుఖవంతునిగ జేయును.

## పంచకళ్యాణి

గుఱ్ఱము ముఖమంత తెలుపురంగు, నాలుగు మోకాళ్ళవరకు తెలుపు రంగు, తదితర భాగములు నలుపు లేక ఎరుపురంగుగానుండును. ప్రమాదాలను తప్పించును. యజమానికి సుఖసౌఖ్యముల నిచ్చును. వ్యాధులరానీయదు. సాధుత్వముగా నుండును. నేత్రములు ముఖము విశాలముగా నుండును. సకిలింపు చాల హాయిగా నుండును. పందెములకు స్వారికి ఉపయోగపడును.

## క్షేమకర

గుఱ్ఱము శరీరమంతా తెలుపురంగుగ లేక ఎరుపురంగుగా నుండును. యజమానుని ధనవంతునిగ జేయును. కదను త్రొక్కును. వడిగాపరుగెత్తును.

# గుణములనుబట్టి నిర్ణయము

## బ్రహ్మసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము తెలుపురంగుగాను, చాలా అందముగాను, దరాగాను యుండును. దీనియందు బ్రహ్మదేవుని గుణములు కలిగియుండుటవలన బ్రహ్మసత్వయని పేరువచ్చినది. ఇది ఎక్కువదూరము పరుగిడును. యజమానిని దినదినాభివృద్ధిజేయును.

## మునిసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము శరీరము తెలుపురంగుగానుండి చాలా సొగసుగానుండును. మునిపుండు గుణములుండుటవలన దీనికి మునిసత్వమని పేరువచ్చినది. యజమానుని శ్రీవంతునిగ, సుఖవంతునిగ జేయును.

## అగ్నిసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము శరీరము ఎరుపురంగుగానుండును. ఇది అగ్నిదేవుని గుణములుకలిగియుండును. యజమానుని అదృష్టవంతునిగ జేయును.

## యమసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము శరీరము నలుపురంగుగానుండును. ఇది యమధర్మరాజు గుణములుగలిగియుండును. యజమానికి ఆరోగ్యమును పెంపొందించును.

## క్షత్రియసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము శరీరము ఎరుపురంగుగానుండును. ఇది క్షత్రియరాజు గుణములుకలిగియుండును. యజమానుని వృద్ధిలోనికిదెచ్చును.

## వాసవసత్వముగలది

ఈ జాతిగుఱ్ఱము శరీరము తెలుపురంగుగానుండును. ఇది యింద్రుని గుణములుకలిగియుండును. యజమానుని ధనకనకవస్తువాహనునిగ జేయును.

# రెండవతరగతి గుఱ్ఱములు

## ధర్మపాది

గుఱ్ఱముగిట్టనుంచి మోకాళ్ళవరకు నాలుగుకాళ్లు తెలుపుగానుండును. తక్కిన శరీరమంతా ఎరుపురంగుగానుండును. ఇది యజమానుని కీర్తివంతునిగ ఆరోగ్యవంతునిగ జేయును. దీనిని ధర్మపాదియందురు.

## సాముద్రి

గుఱ్ఱము రొమ్మ్భాగమున ఎరుపురంగుగను, తక్కిన భాగము నలుపు రంగుగానుండును. యజమానికి సంతోషము, ధనముచేకూర్చును. దీనిని సాముద్రి యందురు.

## మహాసార

గుఱ్ఱము రొమ్మ్భాగము ఎరుపురంగుగను, తక్కినభాగము ఎఱుపు రంగుగానుండును. ఇది యజమానికి ధనముచేకూర్చును. దీనిని మహాసార యందురు.

## దుందుభి

గుఱ్ఱము కడుపు తెలుపురంగుగానుండి, తక్కిన భాగములు ఎరుపురంగుగానుండును. దీనినే దుందుభియందురు. యజమానునికి ధనముచేకూర్చును.

## నందన

గుఱ్ఱము తొంటిభాగములు నలుపురంగుగానుండి, తక్కిన భాగములు ఎరుపురంగుగానుండును. దీనిని నందనయందురు. యజమానుని పుత్రపౌత్రాభివృద్ధిగ జేయును.

## సూర్యజ

గుఱ్ఱము ముందుభాగము ఎరుపుగను, వెనుకభాగము తెలుపుగ నుండును. దీనిని సూర్యజయందురు. యజమానుని తేజోవంతునిగ జేయును.

## చంద్రజ

గుఱ్ఱము ముందుభాగము తెలుపు, వెనుకభాగము ఎరుపురంగుగా నుండును. దీనిని చంద్రజయందురు. యజమానునికి ధనముచేకూర్చును.

## కుబేరసత్వ

ఈజాతి గుఱ్ఱము కుబేరుని గుణములు కలిగియుండును. యజమానుని ధనవంతునిగ జేయును. దీని శరీరము బంగారురంగుకలిగి యుండును. దీనికి సంగీతమంటె యిష్టము.

# మూడవతరగతి గుఱ్ఱములు

## వరుణసత్వ

ఈ జాతిగుఱ్ఱములు వరుణదేవునికున్నంత బలముండును. యజమానుని ధనవంతునిగ, పుత్రవంతునిగ జేయును.

## వాయుసత్వ

ఇది వాయుదేవుని గుణములుకలిగియుండును. శరీరపురంగు మచ్చలు మచ్చలుగానుండును. యజమానుని ధనవంతునిగ, దార్ఢ్యవంతునిగ జేయును.

## ఈశాన్యసత్వ

ఇది శివునిగుణములు కలిగియుండును. శరీరము తెలుపురంగుగా నుండును. కదనుత్రొక్కును. యజమానికి కీర్తి, సుఖముగలిగించును.

## గంధర్వసత్వ

ఇది గంధర్వగుణములు కలిగియుండును. దీనికి సంగీతమంటెప్రీతి. కపోత రంగుకలిగియుండును. యజమానుని సంతోషపెట్టును.

## నాల్గవతరగతి గుఱ్ఱములు

### తి ర్యా క

ఈ జాతిగుఱ్ఱము నొసటిభాగమున మూడు నిలువుగీతలు వంగియుండును. యజమానుని అదృష్టవంతునిగ, కీర్తివంతునిగ జేయును. శరీరము ఎరుపు లేక నలుపురంగుగానుండును. కష్టించి పనిచేయును.

### వైశ్యసత్వ

దీనిశరీరము ఎరుపురంగుగానుండును. యజమానికి సంపదలనిచ్చును.

## అయిదవజాతి గుఱ్ఱములు

### ఆక్షేపణగల జాతులు

### దా ర దో షి

గుఱ్ఱము కనుబొమల మీద సుడియుండును. దీనినే దారదోషి యందురు. యజమాని కీర్తినశింపజేయును.

### చో ర

గుఱ్ఱము గడ్డముపైన సుడియుండును. దీనిని చోరయందురు. యజమాని ధనమంత నాశన మగుటయేగాక అపకీర్తి పొందును.

### దో షి

గుఱ్ఱముమెడను రెండువైపుల ఒకటిగాని రెండుగాని సుడులుండును. దీనిని దోషియందురు. యజమానికీర్తి క్రమేపి నశించుచూ రోగముల పాలగును.

## అపకీర్తి

గుఱ్ఱముదవుడల రెండువైపుల ఒకటిగా రెండుసుడులుండును. దీనిని ఆపకీర్తియందురు. యజమానికి కష్టము విచారము గలిగించును.

## అల్పసార

గుఱ్ఱము భుజములకు దగ్గరగా రెండుగాని, ఒకటిగాని సుడులుండును. దీనిని అల్పసార యందురు. యజమానికి ధననష్టము భార్యానష్టము గలుగును.

## మందచారి

గుఱ్ఱము తొడలకు రెండువైపులగాని, ఒకవైపునగాని సుడియుండును. దీనిని మందచారి యందురు. యజమానికి సుఖముండదు. భార్యాపుత్రులు రోగిష్టులగుదురు.

## కళావిహీన

గుఱ్ఱము కాళ్ళమీద ఒకటి లేక రెండు లేక మూడు లేక నాలుగు వంతున సుడులుండును. దీనిని కళావిహీన యందురు. దీనివలన యజమానికి ధననష్టము గలుగును.

## రోగద

గుఱ్ఱము మోకాళ్లకు రెండువైపుల ఒకటి లేక రెండు సుడులుండును. దీనిని రోగద యందురు. యజమానికి రోగము సంప్రాప్తించును.

## దాండ్య

గుఱ్ఱము కంటిక్రింది భాగమున ఒకటి లేక రెండు సుడులుండును. దీనిని దాండ్యయందురు. యజమానికి నష్టాలు, కష్టాలు, చావులు వచ్చును.

## చ ప ల

గుజ్జము పొట్టక్రింద సుడియుండును. దీనిని చపలయందురు. యజమాని ఆస్తి పోవును.

## క్షే మ హా రి

గుజ్జము ముక్కురంధ్రములు రెండువైపుల ఒకటి లేక రెండు సుడు లుండును. దీనిని క్షేమహారియందురు. యజమాని ఆస్తి కుటుంబము క్షీణిం చును.

## బం ధు నా సి

గుజ్జము చెవులకు రెండువైపుల ఒకటిలేక రెండుసుడులుండును. దీనిని బంధునాసియందురు. యజమానికి మరణము, బంధునాశనము కలుగును.

## అ ల్ప గ తి

గుజ్జము కణతలకు రెండువైపుల ఒకటి లేక రెండు సుడులుండును. దీనిని అల్పగతియందురు. యజమానికి మరణముకలుగును.

## అ మం గ ళి

గుజ్జము మూపురముమీద ఒకసుడియుండును. దీనిని అమంగళి యం దురు. యజమానికి ధననష్టము కలుగును. మూపురమునకు ఎదురుగా రెండు వైపుల ఒకసుడి వంతునయున్నచో యజమాని ఆస్తికి నష్టము.

## అ జ సా ర

గుజ్జము వీపుమీద సుడియున్న యజమాని కీర్తి, ధనము నశించును.

## బ హు హా ని

గుజ్జము పైపెదవి క్రిందపెదవిపైన మచ్చయుండును. దీనిని బహు హానియందురు. యజమాని కారణములేకుండ మరణించును.

## నా స క

గుఱ్ఱము బొడ్డుమీద సుడియున్నచో యజమాని వ్యాధిగ్రస్తుడగును. దీనినీ నాసకయందురు. గుఱ్ఱము శిశ్నముమీదగాని, యోనిమీదగాని మచ్చ యున్నయెడల యజమానికి నష్టాలు వచ్చును.

## అ ల్ప కా మ

గుఱ్ఱముతోక నలుపురంగుగానుండి, తక్కినభాగములు తెలుపు లేక ఎరుపురంగుగానుండిన అల్పకామయందురు. ఇది యజమానుని పలువిధకష్టముల పాలుజేయును.

## ప క్షి స త్వ

గుఱ్ఱము వివిధరంగుల శరీరముగలిగియుండును. యజమానికి ముందు వచ్చే లాభాలన్నిటిని పోగొట్టును.

## మీ న స త్వ

గుఱ్ఱము శరీరమంతా ఎరుపురంగుగలిగియుండును. యజమాని ఆస్తియంతయు క్షీణించును.

# అధమతరగతి గుఱ్ఱములు

## సర్పపుండరీ

గుఱ్ఱము నొసటిభాగమున పాము ఆకారముగా తెలుపు లేక ఎరుపురంగుగానుండును. దీనిని సర్పపుండరీయందురు. యజమానికి ధననష్టము కలిగించును.

## శృంఖలాపుండరీ

గుఱ్ఱము నొసటిభాగమున తెలుపురంగుగా గొలుసు ఆకారముగానుండును. యజమానిని జెయిలుకుపంపును.

## హీనకాంతి

గుజ్జుముమూతి నలుపు, శరీరమంతా తెలుపు లేక ఎరుపురంగుగానున్న హీనకాంతియందురు. యజమాని ఆరోగ్యము ధనముల క్షీణింపజేయును.

## అ కు లీ

గుజ్జుముతల నలుపు, శరీరము తెలుపు లేక ఎరుపురంగుగానున్న హీన కాంతియందురు. యజమానుని విచారగ్రస్తునిగ జేయును.

## రాక్షసత్వ

గుజ్జము శరీరమంతా నలుపురంగుగానుండును. యజమానుని అష్ట కష్టాలు పెట్టును.

## సర్పసత్వ

గుజ్జముశరీరము బూడిదరంగుగానుండును. కుటుంబనాశనముజేయును.